# పరతత్వ పరిశోధన

**2వ భాగము**





రచయిత :

**కీ॥ శే॥ కిడాంబి కృష్ణమాచార్యులు**

పబ్లిషర్ :

శ్రీమతి కె. లలితకుమారి

విశాఖపట్టణము – 530 024

1990

# పరతత్త్వ నిరూపణము

## కళాప్రపూర్ణ డా॥ దాశరథి

(ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి)

ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలక అరుణికీ, అతని కుమారునికి మధ్య, ప్రశ్నోత్తర పూర్వకమయిన సంభాషణ – పరబ్రహ్మ స్వరూప నిరూపణానికి తోడ్పడినదని నేను భావిస్తున్నాను.

తన కుమారుడైన శ్వేతకేతువును తండ్రి అరుణి, న్యగ్రోధవృక్ష ఫలం తెమ్మంటాడు. తెచ్చిన పండును పగలగొట్టమంటాడు. కుమారుడు అలా చేస్తాడు.

"నీకేం కనపడ్డాయి?" అని అడుగుతాడు తండ్రి.

"గింజలు" అంటాడు కుమారుడు.

ఒక గింజను పగలగొట్టమంటాడు తండ్రి. అందులో ఏముందని అడుగుతాడు. శూన్యమని చెపుతాడు కొడుకు.

" ఆ కనుపించని శూన్యంలో ఇంతపెద్ద న్యగ్రోధ వృక్షం ఉంది నాయనా!" అంటాడు తండ్రి.

అర్థంకాలేదంటూ, ఇంకా కొంత వివరించమని ప్రార్థిస్తాడు తండ్రిని శ్వేతకేతువు.

నీళ్ళలో ఉప్పువేయమంటాడు కొడుకుని తండ్రి. ఉదయం కొడుకుని పిలచి నీళ్ళలోవేసిన ఉప్పుని తీసుకు రమ్మంటాడు. ఉప్పు కరిగి పోయింది కనుక తేలేనంటాడు కుమారుడు. తండ్రి ఆ నీళ్ళను రుచి చూడమని చెప్పగా, అలానేచేసి ఉప్పగా ఉన్నాయని సమాధాన మిస్తాడు కుమారుడు.

"ఉప్పు కనిపిస్తున్నదా?" ప్రశ్నిస్తాడు తండ్రి.

"లే" దంటాడు కుమారుడు.

"ఉన్నది! లేనట్టు కనుపిస్తుంది కానీ ఉన్నది! మన శరీరంలో కూడా పరమాత్మ ఉన్నాడు కాని కనుపించడు."

పరతత్వం మనలోనే ఉంది. దాన్ని పరిశోధించటానికి అనేక మార్గాలున్నాయి. ఉపనిషత్తులు ఆ మార్గాన్ని నిర్దేశిస్తున్నాయి. అగాధమయిన ఉపనిషత్ వాఙ్మయాన్ని మధించి సారం తీశారు ఈ ఆచార్య ద్వయం.

మహావిద్వాంసులైన కిళాంబి కృష్ణమాచార్యులవారు, మరిం గంటి సీతారామాచార్యులవారు విఖ్యాతులు. వీరు ముప్పది రెండు బహ్మ విద్యలను గురించి సామాన్య పాఠకునికి అర్థమయ్యేట్లు వ్రాశారు.

నీటిలో కరిగిన ఉప్పువలె పరతత్వం సర్వత్రా కలదు. దాన్ని దర్శించగల శక్తి, సాధనలవల్ల లభిస్తుంది. పరతత్వము నెరుగుటయే బ్రహ్మవిద్య.

ఒక చోటికి చేరుకొనుటకు వివిధ మార్గము లున్నట్లు పరతత్వ మును తెలిసికొనుటకు భిన్న సాధనము లున్నవి.

ఆ శ్రీమన్నారాయణుడొక్కడే పరతత్వము. ఈ అష్టాక్షరి అన్ని రహస్యాలను తనలో దాచుకున్నది.

"ఓం నమో నారాయణాయ"

ఆ నారాయణుడు కేంద్ర బిందువుగా యావద్విశ్వము వికసిం చును. అది సృష్టి. దానిని "మధ్యగామి" అనవలెను.

అఖండ బ్రహ్మాండము ఆ పరతత్వమున లీనమగును. దానిని "మధ్యగామి" అనవలెను.

ఔపనిషదములైన బ్రహ్మ విద్యలను వ్యాఖ్యానసహితముగా ఆంధ్ర భాషలో చక్కగా రచించిన ఈ విద్వద్వర్యులను అభినందిస్తున్నాను.

ఎస్. వి. ఎస్. ఎ. కళాశాల సంస్కృతాధ్యాపకులు
రాష్ట్రపతి బహుమాన ప్రతిగ్రహీత శ్రీ ఉ॥ వే॥ శ్రీ అగు
**న. చ. రఘునాథాచార్యులవారి**

# అభిప్రాయము

శ్రీమన్నారాయణుడే పరతత్త్వము అను సిద్ధాంతమును భగవద్రామానుజులు సకలోపనిషత్సమన్వయ పూర్వకముగా వేదార్థ సంగ్రహమును, శ్రీభాష్య – గీతాభాష్యముల యందును ప్రతిపాదించియున్నారు. వారి యీ సిద్ధాంతమునకు మూల ప్రమాణములు తత్త్వద్రష్టలైన వ్యాసాది మహర్షులచే రచింపబడిన స్మృతీతిహాస పురాణాది ప్రబంధములైనట్లే, భగవత్కృపా సమాసాదిత దివ్యజ్ఞాన సంపన్నులైన ఆళ్వారాదులు ప్రసాదించిన దివ్య ప్రబంధములు గూడనని పెద్దలు వక్కాణింతురు. మహర్షులు స్వయోగ మహిమాలబ్ధ జ్ఞాన విశేషము చేత, బ్రహ్మతత్త్వ ప్రతిపాదక మంత్ర ద్రష్టలైనట్లే, ఆళ్వారులు గూడ భగవత్సాక్షాత్కారమునంది తదనుభవ జనితానంద పరీవాహ రూపముగ దివ్య ప్రబంధములను ప్రసాదించిన వారైనందున, ఈ ద్రావిడ దివ్య ప్రబంధములకు గూడ సంస్కృత వేదసమాన ప్రామాణ్యము కలదని పూర్వాచార్యులవారి ఏకకంఠ నిర్ణయము.

సంస్కృత – ద్రవిడ భాషామయములగు ఉభయ వేదాంతముల యందును సమాన ప్రతిపత్తి గలిగిన భగవద్రామానుజులు ఉభయ ప్రమాణాను సారముగనే పరతత్త్వ నిర్ణయమును చేసిరను విషయము జగద్విదితము.

ఆళ్వారు లందరిలోను ప్రధానముగ పరిగణింపబడు నమ్మాళ్వారులు శఠకోప మునీంద్రులు తమ తిరువాయ్ మొళి ప్రబంధమున దేవతాంతరములకన్న శ్రీమన్నారాయణునికి గల పరత్వమును బహుముఖముల ప్రతిపాదించియున్నారు. మచ్చునకు వారి పాశురము నొక దానిని మన మిక్కడ చెప్పనోవచ్చును.

పాశురము : "తేర్తనులగళంత, శేవడి మేల్,

పూందామం శేర్త్తి అదనై యే, శివన్ ముడి

మేల్ తాన్ కండ పార్తన్ తెళిందొళింద,

పైందుళాయాన్, పెరుమై పేర్తు మొరువరాల్ పేశక్కిడందదే"

మహాభారతమునందలి ఈ క్రింది శ్లోకమున వివక్షితమైన కథ నాధారముగా గొనియే పై పాశుర మవతరించినది. ఆ శ్లోకమిది :

శ్లో॥ "పార్థో విజేతా మధుసూదనస్య
పాదారవిందార్పిత చిత్ర పుష్పమ్ ।
దదర్శ గంగాధర మౌళి మధ్యే
బభూవ వీరః కృతనిశ్చయార్థః"

తన కుమారుడైన అభిమన్యుని వధించిన జయద్రధుని జంపుటకై అర్జునుడు ప్రతిజ్ఞను చేసెను. కాని, అతడు పాశుపతాస్త్రముచేత గాని చావడు. అప్పుడు శివు నారాధించి పాశుపతమును సంపాదించుటకు అర్జునున కవకాశము చాలదు. రథసారిథియైన శ్రీకృష్ణ పరమాత్మ తన శ్రీపాదములనే చూపి, వీనిని పుష్పాదులతో నర్చింపుమని ఆదేశించి అర్జునునకు పాశుపత మంత్రమును జ్ఞాపకము చేసెను అట్లతడు జయద్రధుని వధింపగలిగెను. అదే రోజు రాత్రి స్వప్నమున తాను శ్రీకృష్ణుని పాదములందుంచిన పుష్పములనే శివుని జటాజూటము నందున్నట్లు అర్జునుడు దర్శించి ఆశ్చర్య చకితుడై శ్రీకృష్ణుని పరతత్త్వమును దెలిసికొనగల్గెను. పై శ్లోకార్థమునే గ్రహించిన నమ్మాళ్వార్లున్నూ, ఈ పట్టముచే శ్రీమన్నారాయణ పరతత్త్వము స్పష్టీకరించిరి.

ఇట్లనేక దివ్యసూక్తులచే ఆళ్వారులందరు స్థాపించిన పరతత్త్వ విశేషమునే రామానుజులును ప్రచార మొనర్చిరి. ఈ పరమార్థమును ఈ "పరతత్త్వ పరిశోధన" గ్రంథమున తేటతెలుగులో ద్వాత్రింశత్ ప్రబన్ధ విద్యలను ఇతర స్మృతీతిహాసాదులను ప్రమాణీకరించుచు ఈ గ్రంథకర్తలగు సీతారామాచార్య - కృష్ణమాచార్యులు ఆంధ్రజాతి కంతకును శ్రీ రామానుజ సిద్ధాంతమును అందించిన వారైరి. వీరి నిరూపణము లలిత హృద్యము ప్రామాణికమునై యున్నందులకు వీరిని హార్దికముగా అభినందించుచున్నాము.

వ్యాకరణ విద్యా ప్రవీణ, నవీనన్యాయ విద్వాన్, విశిష్టాద్వైత వేదాంత విద్వాన్, **శ్రీమాన్ కొమాండూరు వేంకటదేశికాచార్యులవారి**

# అభిప్రాయము

ఈ గ్రంథము నామూలాగ్రముగా పరిశీలించితిని. ఏతద్గ్రంథ రచయితలు ఉభయవేదాంత ప్రవర్తకులు నగు శ్రీమాన్ కిళాంబి కృష్ణమాచార్యులుగారు, ఉపనిషద్విద్యావిశారద మదింగంటి సీతారామాచార్యులుగారును నాకు చిరపరిచితులు. వీరు జంటకవులవలె గలిసి యీ గ్రంథమును వెలువరించినారు. వీరు విశిష్టాద్వైత సంప్రదాయమును బాగుగ నవగాహన చేసికొన్న విజ్ఞులు. శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని వేదోపనిషత్స్మృతి, పురాణేతిహాస కావ్యముల నుండి పుష్కలముగా ప్రమాణముల గ్రహించి విశిష్టాద్వైతమును సర్వశ్రేష్ఠముగా సర్వాంగ సుందరముగాను రుజువు చేసినారు.

"న తత్ర చక్షుర్గచ్ఛతి, న వాగ్గచ్ఛతి నో మనః
యద్వాచా నభ్యుదితం యన్మనసా న మనుతే
యేనాహుర్మనో మతం, తదేవ బ్రహ్మత్వం విద్ధి"।

= కనులు మొదలైన జ్ఞానేంద్రియములు, వాక్కు మొదలైన కర్మేంద్రియములు మనస్సుగూడ ఆ పరమాత్మదాక చేరుటకు సమర్థత లేనివి. వాక్కుద్వారా చెప్ప సాధ్యపడు తత్త్వమేదియును బ్రహ్మము యొక్క వాస్తవమగు రూపము కాజాలదు. మనసుచేత నూహింప సాధ్యపడు తత్త్వమేదియును బ్రహ్మముయొక్క వాస్తవమగు రూపము కాజాలదు. ఎవని శక్తిచే వాక్కు పల్కుటకు, మన సూహించుటకు సమర్థమగునో వాడే బ్రహ్మమని తెలిసికొనుమని కేనోపనిషత్తు చెప్పుచున్నది. కావుననే, వీరిగ్రంథమునకు 'పరతత్త్వ పరిశోధన' మని పేరు పెట్టినారు. అనేక దృక్కోణములతో పరమాత్మను గనిపెట్టి యుపాసించు పద్ధతులు ఉపనిషత్తులలో నందందు విస్తరించి యున్నవి. అవే

బ్రహ్మవిద్యలు అవి ముఖ్యముగా 32 విద్యలని పెద్దలు చెప్పుచున్నారు ఆచార్యోపదేశము వల్లగాని వాని ముడులు విడిపోవు.

ఈ గ్రంథమునందు ముఖ్యముగా జెప్పఁబోదగినవి ఈ 32 బ్రహ్మవిద్యలే. ఇవి తెలిసికొను టెంత యవసరమో తెలుపుటంత కష్టము. బ్రహ్మవిద్యలను ఇంత స్పష్టముగా తెలుగులో వ్రాయబడి యుండుట నేను ఇతరత్రి చూడలేదు. బ్రహ్మవిద్య యనగా పరమాత్మో పాసనయే. 'ఆనందాదయః ప్రధానస్య' బ్రహ్మసూత్రము 3-3-11. బ్రహ్మ విద్యలయం దంతట ఉపాస్య వస్తువు పరమాత్మ యొక్కడే. గుణిని విడచి గుణము లుండవు. కావున సత్యత్వ జ్ఞానము ఆనందము అమలత్వము అనంతత్వము లనెడి కళ్యాణగుణములు అన్ని బ్రహ్మ విద్యలందు నున్నట్లే తలంపవలెను. ఈ సత్యజ్ఞానాదులే పరమాత్మ స్వరూపమును నిరూపించునవి. కావున నిట్లు కళ్యాణగుణ సంపన్నుని గానే పరమాత్మ నుపాసింపవలెను. ఫలితము మోక్షము. రామానుజులు తమ శ్రీభాష్యములో

"పరవిద్యాసు సర్వాసు సగుణమేవ బ్రహ్మో
పాస్యం ఫలం చ ఏక రూపమేవ" అని

సాధించినారుగదా! తరువాత చెప్పఁబోదగినవి అవతార వైభవము, పన్నిద్దరాళ్వార్ల చరిత్రలు, శ్రీసూక్తులు, తిరుప్పావు, తిరుమంత్రార్థము ననునవి. ఇవికూడ నీ గ్రంథమందు భక్తిప్రపత్తులు గలవారి కత్యంత ఉపయోగ మగునట్లు చక్కగాదిద్ది తీర్పబడినవి. ఇవన్నియు ప్రపత్తి నిష్ఠులగు పండితులకు, సామాన్యులకు నవసరమైనవే.

కావున అట్టి తెలుగువారి కామోదయోగ్యముగా అనుష్ఠానానుకూలముగాను, ఈ గ్రంథ మున్నదనుట కేమాత్రము సందేహము లేదు. ఈ గ్రంథము నామూలాగ్రముగా వ్రాసి దిద్దిన భాషాప్రవీణ శ్రీమాన్ మరింగంటి భట్టరాచార్యులవారి శ్రమ ప్రశంసనీయము. "సమ్ప్రదాయః ప్రమాణం."

అష్టావధాని, ప్రవచనరత్న, భగవద్విషయ పండితుడునగు

## శ్రీమాన్ కొదమసింహం శ్రీమన్నారాయణాచార్యులవారి

# అభిప్రాయము

శ్రియః పతియు శ్రీ వైకుంఠ నికేతనుడు అఖిలహేయ ప్రత్యనీక కళ్యాణగుణైకతానుడును నిత్యముక్తానుభావ్యుడునగు శ్రీమన్నారాయణుని అవ్యాజ కృపా కటాక్ష విశేషముచే ఈ రచయితలిరువురును ఈ "పరతత్త్వ పరిశోధన"ను చక్కగా వ్రాయగలిగిరి.

'మున్నోర్ మొழிందముఱై తప్పామల్'

అను మనవాళ మహామునుల శ్రీసూక్తి ననుసరించి, వీరు శ్రుతి స్మృతి-పురాణేతిహాసములలోని ప్రమాణ రత్నముల సేకరించి, ఆళ్వారాచార్యుల శ్రీసూక్తులతో రచించియున్నారు.

వీరి యీ గ్రంథ మామూలాగ్రముగా బరిశీలించితిని.

"మోక్షముం డాఁబోదు, అర్థపంచక జ్ఞాన మావశ్యకం" అను శ్రీసూక్తి మనస్సునం దుంచుకొని,

"ప్రాప్యస్య బ్రహ్మణోరూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః
ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేః తథా ప్రాప్తివిరోధి చ।
వదంతి సకలా వేదాః సేతిహాస పురాణకాః
ఋషయశ్చ మహాత్మానః వేద వేదాంత వేదినః"

అను ప్రమాణానుసారము పరతత్త్వ పరిశోధనను విశేషముగా జరిపి సాకల్యముగా, ఏకవాక్యత కలుగునట్లు బ్రహ్మవిద్యలు మొదలుగా నాధ్యాత్మిక ముఖ్యగ్రంథముల నవలోకించి, పరతత్త్వమును శ్రీమన్నారాయణుడుగా నిర్ణయించిరి.

సృష్ట్యాది పురుషుడు నారాయణుడే యని, అతడు సత్యము జ్ఞానము అనంతము నైనవాడని "యతో వా ఇమాని భూతాని జాయంతే" అను కారణ వాక్యము ననుసరించి వ్యాసభగవానుడు

"జన్మాద్యస్య యతః", "కారణం తు ధ్యేయః"

అని బ్రహ్మసూత్రాలు నిబంధించెను.

భగవద్రామానుజులు "అఖిల భువన జన్మ స్థేమ భంగాదిలీలే అనుచు శ్రీభాష్యమును రచించిరి. మహాభారతంలో

"ఆలోడ్య సర్వశాస్త్రాణి, విచార్య చ పునః
పునః ఇద మేకం సునిష్పన్నం, ధ్యేయో నా
రాయణ స్సదా" అని చెప్పబడెను.

శ్రీభాగవతములో "ఏవ నారాయణ శ్శ్రీమాన్, క్షీరార్ణవ నికేతనః
నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాపురీం"

అని నారాయణ పరతత్త్వమే ప్రకటింపబడినది. శ్రీమద్రామాయణములో విశ్వామిత్రుడు

"అహం వేద్మి మహాత్మానం రామం సత్య పరాక్రమం"

సత్యపరాక్రముడైన రాముడు పరమాత్ముడని నే నెరుగుదు నన్నాడు. ఈ శ్లోకార్థము "వేదవాక్కునకు ప్రతిధ్వని, ఆళ్వార్లలో ముదలాళ్వార్లు "తిరుక్కండేన్ నారణం కండేన్" లక్ష్మిని సేవించితిని నారాయణుని సేవించితిని అని శ్రియః పతినే పరమాత్మగా బోధించి యున్నారు. ఈ వాక్యము "హ్రీశ్చతే లక్ష్మీ శ్చ పత్న్యౌ" అను వేద వాక్యమునకు ప్రతిరూపమే. నమ్మాళ్వారు తిరువాయిమొళ్ది మొదటి పాశురములో మానవ సంబోధన చేయుచు

"ఉయుర్వరు ఉయుర్నల ముడయవన్ యవనవన్" నిస్సమాభ్యధిక్యలభవముచే సకల బంధముల నుండి విడివడి ఈ దేహానంతర మందు మోక్షమొందుట నిస్సంశయము.

ఇట్టివెన్నో అమూల్యమైన విషయములను సప్రమాణముగా సులభశైలిలో బ్రహ్మవిద్యల నుండి మహాత్ముల ప్రవచనముల వరకు శ్రద్ధాభక్తులతో రచయిత ఈ గ్రంథమందు నిబంధించి యున్నారు. ఈ గ్రంథమును నిత్యము పఠించుచు నిందలి విశేషముల మనస్సునకు బట్టించుకొన్నచో జన్మ తరించుననుట అతిశయోక్తి కానేరదు. వీరి కృషి ఫలవంతమై అభివృద్ధి నొందుటకై ఆ శ్రియఃపతిని సర్వదా ప్రార్థించు చున్నాను.

This Book is Published in Memory of



Late Shreeman Kilambi Krishnamacharyulu,
M. A; M Ed.,

( 4-8-1926 — 15-10-1982 )

**ON HIS 60th BIRTHDAY**

*Published by :*

Wife : Smt. K. Lalitha Kumari

Sons : 1. K. R. BHASHYAM
Circle Inspector, Intelligence, VSP.

2. K. RAMANUJACHARYULU
Education Department

3. K. V. PRASAD
Sri Rasi Cements

4. K. T. SREENIVAS

# Preface

Visistadwaita cult discards both the unreality of universe setup in the Adwaita & dual verity involved in the Dwaita explains the Universe as an indivisible organism with the

SUPREME ( TATWA )

I S W A R A

Who is also active and beneficient, as the trimost ruling soul or principle and the subservient Chit (sentiment) and Achit ( Non sentiment ) as His unseparable atributes which in his infinite Mercy, He projects as the perceived world and with draws unto Himself time to time for the liberation and salvation of myriads of the sentiment, who wallow in ignorance, even while eternal bliss at the feet of the LORD is their birth right.

—AUTHOR

# పరితత్వ పరిశోధన

## శ్రీ సరస్వతీ ప్రార్థన

శ్లో॥ విద్యానామ నర స్వరూప మధికం ప్రచ్ఛన్న గుప్తం ధనం
విద్యా భోగకరీ యశస్సుఖకరీ విద్యాగురుణాం గురు।
విద్యా బంధుజనో విదేశగమనే విద్యా పరాదేవతా
విద్యారాజ సుపూజ్యతా నహి ధనం విద్యా విహీనః పశుః॥

శ్లో॥ సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా॥

( ఈశ్వర భాంతి అని స్మరణ చేయవలెను )

రామానుజ దయాపాత్రం జ్ఞాన వైరాగ్య భూషణమ్।
యతీన్ద్ర ప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్॥
యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహతః తదితరాణి తృణాయ మేనే।
అస్మద్గురోర్భగవతో౽స్య దయైక సింధో
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే।

( శ్రీమన్నాథమునులు పెరియాళ్వార్లను స్తోత్రము
చేయు శ్లోకము )

గురుముఖ మనధీత్య ప్రాహ వేదాన శేషాన్
నరపతి పరిక్లృప్తం శుల్క మాదాతు కామః।
శ్వశుర మమర వన్ద్యం రంగనాథస్య సాక్షాత్
ద్విజకుల తిలకం తం విష్ణుచిత్తం నమామి॥

( తిరుప్పావై ప్రబంధమున ఆనతిచ్చిన ఆండాళ్ ను భక్తులిట్లు కీర్తించుచున్నారు. ఈ శ్లోకమును పరాశరభట్టరు తెల్పియున్నారు. )

నీళాతుఙ్గ స్తనగిరి తటీ సుప్తముద్బోధ్య కృష్ణమ్
పారార్థ్యం స్వం శ్రుతి శత శిరస్సిద్ధ మధ్యాపయంతీ ।
స్వోచ్ఛిష్టాయాం స్రజని గళితం యా బలాత్కృత్య భుఙ్క్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయమస్తు భూయః ॥

మాతా పితా యువతి యస్త నయా విభూతి
సర్వం యదేవ నియమేన మదన్వయానాం ।
ఆద్యస్య న కులపతే ర్వకుళాభి రామం
శ్రీమత్త దఙ్ఘ్రి యుగళం ప్రణమామి మూర్ధ్నా ॥

భూతం సరస్య మహాద్వాయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగి వాహాన్ ।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
శ్రీమత్పరాంకుశ మునిం ప్రణతోస్మి నిత్యమ్ ॥

## ABOUT THE CULT

The beauty of the Visistadwita lies in its conception of God head of atributes or gunas whose play ground is entire Universe from whom all the animate and inanimate emanate and in whom all merge ultimately This goes as a compramise between absolute manisam of Adi Sankara and distinctive separation of Deva & Jiva of Ananda Tirtha, the famous Madhvacharya.

**Visistadwita Cult :**

Alwars, Sri Ramanujacharya, Godadevi are important.

The contribution of Sri Ramanujacharya the great Vaishnavite preceptor, to the philosophy of Vedanta is unique and immeasarable.

# శ్రీ వైష్ణవ నిత్యానుసంధాన సంగ్రహము

ధ్యేయ స్సదా సవితృ మండల మధ్యవర్తీ
నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః ।
కేయూరవాన్ మకర కుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయ వపుర్ధృత శంఖ చక్రః ॥

—: గాయత్రీ మంత్రము :—

ఓం భూర్భువస్సువః, ఓం తత్సవితు ర్వరేణ్యం ।
భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్ ॥

( పదిమారులు అనుసంధించవలెను )

—: వాక్య గురు పరంపర :—

అస్మద్గురుభ్యో నమః, అస్మత్పరమ గురుభ్యో నమః, అస్మత్సర్వ గురుభ్యో నమః, శ్రీమతే రామానుజాయ నమః, శ్రీ పరాంకుశ దాసాయ నమః, శ్రీ మద్యామున మునయే నమః, శ్రీరామ మిశ్రాయ నమః, శ్రీ పుండరీకాక్షాయ నమః, శ్రీమన్నాథమునయే నమః, శ్రీమతే శఠకోపాయ నమః, శ్రీమతే విష్వక్సేనాయ నమః, శ్రియై నమః, శ్రీధరాయ నమః.

శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవం
యతీంద్ర ప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ।
లక్ష్మీనాథ సమారంభాం నాథయామున మధ్యమాం
అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరామ్ ॥

యోనిత్య మచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైక సింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥

మాతా పితా యువతయస్తనయా విభూతి
సర్వం యదేవ నియమేన మదన్వయానాం ।
ఆద్యస్యనః కులపతేర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రి యుగళం ప్రణమామి మూర్ధ్నా

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాద
శ్రీ భక్తసార కులశేఖర యోగివాహాన్ ।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
శ్రీమత్పరాంకుశ మునిం ప్రణతోస్మి నిత్యమ్ ॥

—: మూల మంత్రము :—

ఓమ్ నమో నారాయణాయ

—: ద్వయ మంత్రము :—

శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే
శ్రీమతే నారాయణాయ నమః ॥

—: చరమ శ్లోకము :—

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥

—: లక్ష్మి స్తుతి :—

లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం శ్రీరంగధామేశ్వరీం ।
దాసీభూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురామ్ ॥
శ్రీమన్మంద కటాక్షలబ్ధ విభవ బ్రహ్మేంద్ర గంగాధరాం ।
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుంద ప్రియామ్ ॥

# సంక్షేప విష్ణు సహస్రనామ స్తోత్రం

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్న వదనం ద్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే ॥

యస్య ద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥

అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే ।
సదైకరూప రూపాయ విష్ణవే సర్వజిష్ణవే ॥

యస్య స్మరణ మాత్రేణ జన్మసంసార బంధనాత్ ।
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే ॥

♦ ఓం నమో విష్ణవే ప్రభవిష్ణవే ♦

కేనోపాయేన లఘునా విష్ణోర్నామ సహస్రకమ్ ।
పఠ్యతే పండితైర్నిత్యం శ్రోతుమిచ్ఛామ్యహం ప్రభో ॥

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥

మంగళా శాసనపరై ర్మదాచార్య పురోగమైః ।
సర్వైశ్చ పూర్వైరాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్ ॥

---

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోప శాంతయే ॥

యస్యద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరఃశతమ్ ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

## — : వాల్మీకి ప్రార్థన : —

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలమ్ ॥

వాల్మీకేర్మునిసింహస్య కవితావనచారిణః ।
శృణ్వన్ రామకథానాదం కోనయాతి పరాంగతిమ్ ॥

## — : ఆంజనేయ ప్రార్థన : —

గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసమ్ ।
రామాయణ మహామాలా రత్నం వందే నిలాత్మజమ్ ॥

అంజనానందనం వీరం జానకీ శోకనాశనమ్ ।
కపీశమక్ష హంతారం వందే లంకా భయంకరమ్ ॥

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూథ ముఖ్యం
శ్రీరామదూతం శిరసానమామి ॥

ఉల్లంఘ్యసింధోస్సలిలం సలీలం
యశ్శోక వహ్నిం జనకాత్మజాయాః ।
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయం ॥

ఆంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రి కమనీయ విగ్రహం ।
పారిజాత తరుమూలవాసినం ।
భావయామి పవమాన నందనం ॥

యత్రయత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిం ।

బాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాంతకం ।

## — : శ్రీరామ ప్రార్థన : —

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం ।
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి ।

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితం ।
అగ్రేవాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలమ్ ।

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం ।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం ।

## — : జయ మంత్రం : —

జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః ।
రాజా జయతిసుగ్రీవో రాఘవేణాభి పాలితః ।

దాసోహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్ట కర్మణః ।
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజ ।

నరావణ సహస్రంమే యుద్ధేప్రతిబలం భవేత్ ।
శిలాభిస్తుప్రహరతః పాదపైశ్చ సహస్రశః ।

అర్ధయిత్వా పురీంలంకాం అభివాద్యచ మైథిలీం ।
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసాం ।

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది ।
పౌరుషేచా ప్రతిద్వంద్వః శరైనం జహిరావణమ్ ।

నమోస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై।
నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యః
నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః॥

ఓమ్ శ్రీరామాయ నమః

— : మంగళమ్ : —

మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాబ్ధయే।
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్।

ఆసాద్యనగరీం దివ్యాం అభిషిక్తాయ సీతయా।
రాజాధిరాజ రాజాయ రామభద్రాయ మంగళమ్॥

— : (ధార) సమర్పణము : —

కాయేనవాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతేః స్వభావాత్।
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి॥

యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్।
తత్సర్వం క్షమ్యతాం దేవ రామచంద్ర నమోస్తు తే॥

ఓమ్ తత్సత్ — శ్రీకృష్ణార్పణమస్తు.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోప శాంతయే॥

యస్యద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరఃశతమ్।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥

శ్రీ భగవద్గీతా పారాయణారంభమున అనుసంధించవలసిన శ్లోకములు

1 వ్యాసం వశిష్ఠనప్తారం । శక్తేః పౌత్ర మకల్మషమ్
పరాశరాత్మజం వందే । శుకతాతం తపోనిధిమ్ ॥

2 సమ్యఙ్న్యాయ కలాపేన । మహతా భారతేన చ
ఉపబృంహిత వేదాయ । నమో వ్యాసాయ విష్ణవే ॥

3 సారథ్య మర్జున స్యాజౌ । కుర్వన్ గీతామృతం దదౌ
లోకత్రయోపకారాయ । తస్మై కృష్ణాత్మనే నమః ॥

4 ప్రపన్న పారిజాతాయ । వేత్రతోత్రైక ప్రాణయే
జ్ఞానముద్రాయ కృష్ణాయ । గీతామృత దుహే నమః ॥

5 కరకమల నిదర్శితాత్మ ముద్రః
పరికలితోన్నత బర్హి బర్హ చూడః
ఇతరకర గృహీత వేత్ర తోత్రో
మమ హృది సన్నిధి మాతనోతు శౌరిః ॥

6 అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠన్
పశ్చాత్పార్థం ప్రణయ సజుషా చక్షుషా వీక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే, దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథమధి వసన్ పాతున స్సూత వేషః ॥

7 కృష్ణం కమల పత్రాక్షం । పుణ్యశ్రవణ కీర్తనం
వాసుదేవం జగద్యోనిం । నౌమినారాయణం హరిమ్ ॥

8 కృష్ణాయ యాదవేన్ద్రాయ । జ్ఞానముద్రాయ యోగినే
నాథాయ రుక్మిణీశాయ । నమో వేదాన్త వేదినే ॥

## గీతా పారాయణావసానమందనుసంధింపవలసిన

## — : శ్లోకములు : —

1 గీతాశాస్త్ర మిదంపుణ్యం । యః పఠేత్ప్రయతః పుమాన్
విష్ణోః పద మవాప్నోతి । భయ - శోకాది - వర్జితః ॥

గీతాధ్యయన శీలస్య । ప్రాణాయామ పరస్య చ
నైవ సన్తిహి పాపాని । పూర్వజన్మ కృతాని చ ॥

మల నిర్మోచనం పుంసాం । జలస్నానం దినేదినే
సకృద్గీతామ్భసి స్నానం । సంసార మల మోచనమ్ ॥

గీతా సుగీతా కర్తవ్యా । కిమన్యైశ్శాస్త్ర సఙ్గ్రహైః
యా స్వయం పద్మనాభస్య । ముఖపద్మాద్వినిస్సృతా ॥

భారతామృత సర్వస్వం । విష్ణోర్వక్త్రాద్వినిస్సృతమ్ ॥
గీతాగఙ్గోదకం పీత్వా । పునర్జన్మ న విద్యతే ॥

సర్వోపనిషదో గావః । దోగ్ధా గోపాల నన్దనః
పార్థోవత్సస్సుధీర్భోక్తా । దుగ్ధంగీతామృతం మహత్ ॥

ఏకం శాస్త్రం దేవకీపుత్ర గీతం । ఏకో దేవో దేవకీ పుత్ర ఏవ
ఏకో మన్త్రస్తస్య నామాని యాని కర్మాప్యేకం తస్య దేవస్య సేవా ॥

## — : గీతార్థ సంగ్రహము : —

స్వధర్మజ్ఞాన వైరాగ్య । సాధ్య భక్త్యేక గోచరః
నారాయణః పరబ్రహ్మ । గీతాశాస్త్రే సమీరితః ॥

జ్ఞాన కర్మాత్మికే నిష్ఠే । యోగలక్ష్యే సుసంస్కృతే
ఆత్మానుభూతి సిద్ధ్యర్థే । పూర్వషట్కేన చోదితే ॥

మధ్యమే భగవత్తత్త్వ । యథాత్మ్య వ్యాప్తి సిద్ధయే
జ్ఞాన కర్మాభి నిర్వర్త్యో । భక్తియోగః ప్రకీర్తితః ॥

ప్రధాన పురుషవ్యక్త । సర్వేశ్వర విచిన్తనమ్
కర్మధీర్భక్తి రిత్యాది । పూర్వశేషోఽన్తిమోదితః ॥

పితాసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।

న త్వత్సమో ఽ స్త్యభ్యధికః కుతో ఽ న్యో
లోకత్రయే ఽ ప్య ప్రతిమప్రభావః ॥

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥

— : (ధార) సమర్పణ : —

కాయేనవాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి ।

యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్ ।
తత్సర్వంక్షమ్యతాం దేవరామచంద్ర నమోస్తు తే ।





## శ్రీమద్భగవద్రామానుజులు

శ్లో॥ కాషాయశోభి కమనీయ శిఖానివేశం,
దండత్రయోజ్జ్వల కరం విమలోపవీతం
ఉద్యద్దినేశనిభ ముల్లస దూర్ధ్వపుండ్రం,
రూపం తవాస్తు యతిరాజ! దృశోర్మమాగ్రే ।



## గోదాదేవి

శ్లో॥ నీళా తుంగస్తనగిరి తటీసుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశత శిర స్సిద్ధ మధ్యాపయంతీ
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్యభుంక్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః ॥

This Book is Published in Memory of

Late Sreeman

# KILAMBI KRISHNAMACHARYULU

ON HIS 60th BIRTHDAY

By



## Sri O. S. REDDY

Seethammadhara, Visakhapatnam.

# దశావతారములు

"మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ కృష్ణశ్చ బౌద్ధః కల్కి రేవచ"

## 1. మత్స్యావతారము :

సోమకాసురుడు వేదముల నెత్తుకొనిపోయి సముద్రములో దాగుకొనగా, పరమాత్మ మత్స్యావతార మెత్తిపోయి, జలములం దారాక్షసుని వెదకిచంపి, యావేదములను దెచ్చి బ్రహ్మదేవున కిచ్చెను. బ్రహ్మదేవుడా వేదములందలి సృష్టిప్రణాళికను బట్టియే, బ్రహ్మాండముల సృష్టించు చుండును. అందరకును సత్ప్రవర్తనను కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులను దెల్పు ధర్మగ్రంథము లావేదములు. అట్లు మత్స్యావతారమా ధర్మగ్రంథముల నుద్ధరించి ప్రపంచమునకు మేలు చేకూర్చెను.

## 2. కూర్మావతారము :

దేవదానవు లమృతమును గ్రోలు కాంక్షతో క్షీరసాగరమును మథింపదలచిరి. మందరపర్వతమును కవ్వముగా వాసుకి సర్పమును త్రాడుగా జేసికొనిరి. దానవు లావాసుకి తలవైపును, దేవతలు దాని తోకవైపును బట్టుకొని ఆ పాలసముద్రమును మథించిరి. ఆ సమయములో ఆ సముద్రములోని కవ్వపుగొండ మునిగిపోకుండ దానిక్రింద కూర్మ రూపముతో నిలిచి విష్ణువు వారికి సాయపడెను. దేవతలు ధర్మపరులు. కావున ధర్మపక్షపాతియగు భగవంతుడు మోహిన్యవతారము గూడ నెత్తి, ఆ దేవతలకే ఆ యమృతము త్రాగు నవకాశమిచ్చి, రక్షించినాడు. ఈ కూర్మనాథునిదే శ్రీకూర్మక్షేత్రము. ఈ మోహిని యొక్క అర్చారూపమే "ర్యాలి" గ్రామములో మోహినీ కేశవస్వామి యను పేరుతో భక్తుల పూజల నందుకొనుచున్నది.

## 3. వరాహావతారము :

హిరణ్యాక్షుడను రాక్షసరాజు బలగర్వితుడై భూమిని చాపను జుట్టినట్లు చుట్టుచుండెనట. అందువలన సన్మార్గులగు మునులకు ఋషులకును బాధ కల్గినది. వారి నుద్ధరించుటకై పరమాత్మ అడవిపంది రూపముతో నవతరించి యా హిరణ్యాక్షుని సంహరించి ప్రపంచోపద్రవమును మాన్పెను. యజ్ఞ వరాహస్వామి యను పేరుతో తిరుమల మున్నగు దివ్యస్థలములందు బూజింపబడు చున్నాడు.

## 4. నరసింహావతారము :

"నృసింహ రామ కృష్ణేషు షాడ్గుణ్యం పరిపూరితం
దీపాదుత్పన్న దీపవత్ ||"

అవతారము లన్నింటిలోను శ్రీ నృసింహ - శ్రీరామ - శ్రీకృష్ణావతారములు మూడును ప్రశస్తములు. వీనియందు ఆ పరతత్వ లక్షణములు స్పష్టముగా గానవచ్చును. కావున నివి పరిపూర్ణావతారములుగా పెద్దలు నిర్ణయించిరి. ఒక దీపము నుండి మరొకదీప మేర్పడునట్లు ఆ పరతత్వము నుండి అంతటి మహిమతో నేర్పడిన యవతారములు ఇవి. మోక్షార్థులీయవతారములను ముఖ్యముగా స్మరింపవలెనని శ్రీమచ్ఛంకర భగవత్పాదులు బోధించిరి. స్తోత్రములు వ్రాసిరి. లక్ష్మీనృసింహ స్తోత్రములో నృసింహుని స్తుతించిరి.

"నామ స్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవతరణే,
రామ హరే కృష్ణ హరే! తవ నామ వదామి సదా నృహరే!"

అని కీర్తించి "కలౌ సంకీర్త్య కేశవ" మందురుగదా.

హిరణ్యకశిపు డను రాక్షసరాజు ఘోరమైన తపస్సుచేసి బ్రహ్మదేవుని వలన పంచభూతములచేగాని, మనుష్యులచేతగాని, జంతువులచేగాని, రాత్రియందుగాని పగటియందుగాని, ఇంటిలోగాని బయట

కాని, ప్రాణ మున్నదానిచేగాని ప్రాణములేనిదానిచేతగాని తనకు చని పోకుండ వరము బొందెను. ఆవర గర్వమువల్ల లోకులను లోకపాలురను పేధించెను; బాధించెను. దేవత లారాక్షసుని యాగడములను విష్ణు మూర్తితో జెప్పుకొని మొరబెట్టుకొనిరి. వారి కావిష్ణువు తాత్కాలిక ముగా సమాధానము చెప్పి పంపించినాడు. హిరణ్యకశిపుడు తన సోదరుడైన హిరణ్యాక్షుని సంహరించినాడన్నకోపముతో, నా విష్ణు మూర్తిపై క్రోధము పెంచుకొన్నాడు. ఆవిష్ణు వతనిని వధించుటకై నరసింహావతార మెత్తవలసి వచ్చినది. హిరణ్యకశిపుని వధముతే యా నృసింహావతారమును ఆవిధముగా మూర్తి గట్టించినది.

హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుడు, విష్ణుభక్తుడు. అహర్ని శమును విష్ణునామ సంకీర్తనతో గాలక్షేపము చేయుచుండెను. తండ్రి కుమారునకు ఆ విష్ణునామమును మానుమని సర్వధా బోధించెను, బాధించెను. కత్తులతో బొడిపించెను. పాములచే గరపించెను. ఏనుగు లతో ద్రొక్కించెను. పర్వతములనుండి బడద్రోయించెను. కాని ప్రహ్లాదుడు చావలేదు; విష్ణుభక్తి మానలేదు.

హిరణ్యకశిపుడు "నీ విష్ణు వెక్కడ నున్నాడురా" యని ప్రహ్లా దుని నిలువదీసి గద్దించి యడిగెను.

ప్రహ్లాదుడు :

"ఇందుగల డందు లేడను
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలడు దానవాగ్రణి వింటే!"

అని యా విష్ణుమాహాత్మ్యము నుగ్గడించెను. హిరణ్యకశిపుడు: "ఈ స్తంభమునందున్నాడురా?" యని తన సభాస్తంభమును నొకదానిని గదాదండముతో పెల్లుగ్గని కొట్టెను. కొట్టుటయే తడవుగా స్తంభము

పెట పెటమని విరచుకొన్నది. శ్రీమన్నారాయణుడు మానవ శరీరముతో సింహవక్త్రముతో భయంకరాకారుడై వికటాట్టహాసము చేయుచు ప్రత్యక్షమయ్యెను. ఆ శ్రీపతి హిరణ్యకశిపు డొందిన బ్రహ్మవరముల కభ్యంతరము లేకుండ మనుష్యుడు - జంతువునుగాని నరసింహావతార మెత్తి, రాత్రియు - పగలును గాకుండునట్లు సంధ్యాసమయములో, ఇంటిలో గాకుండ - బయట గాకుండ ద్వారబంధములో, భూమిమీదగాకుండ ఆకాశమున గాకుండ తన తొడల మీద నుంచుకొని, ప్రాణమున్న వానిచే గాకుండ ప్రాణము లేనివానిచే గాకుండ ఉండియు లేని క్రూరమైన తన గోళ్ళతో, హిరణ్యకశిపుని జీల్చిచంపెను. భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుని రక్షించెను. హిరణ్యకశిపుని మరణముతో లోకాల పీడ విరగడయై పోయినది. ఈ నారసింహుడే, అర్చారూపములో అహోబలము, స్తంభాద్రి, వేదాద్రి, సింహాద్రి, కనిగిరి, యాదగిరి, మంగళగిరి, ఉర్లగొండ, వేల్పుగొండ మల్లూరు మొదలగు పుణ్యక్షేత్రములందు భక్తులకు నయనానందము గొల్పుచు వారివారి యభీష్టముల దీర్చుచు వేంచేసియున్నాడు. ప్రహ్లాదుని పరమ భాగవతోత్తమునిగా పెద్దలు నిర్ణయించినారు.

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్య
రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాది
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి"

## 5. వామనావతారము :

రాక్షస సార్వభౌముడగు బలిచక్రవర్తి మొదట దన పశుబలముచే నింద్రాది లోకపాలుర జయించెను. వారియైశ్వర్యమును వశపరచుకొనెను. రంభాద్యప్సరస నాట్యాదుల దిలకించెను. కాని యందు వలన దాను కోరుకొన్నంత సంతృప్తి కలుగలేదు. తరువాత సాత్త్వికముగ నింద్రపదము నధిష్ఠింపగోరి నూరు యజ్ఞములు చేసెను. నూరవ

యజ్ఞము పూర్తి కాగా బ్రాహ్మణోత్తములకు సంభావన సత్కారములు చేయుచున్న సమయ మది.

ఆ సమయములో పరమాత్మ వామనావతారమెత్తి బ్రహ్మచారిగా వచ్చి యా బలిచక్రవర్తిని మూడడుగుల ప్రదేశము దాన మడిగెను. ఇదొక యగ్నిపరీక్ష. ఆ బలి యట్లే యిచ్చెదనని వాగ్దానము చేసెను. అతని గురువగు, శుక్రాచార్యుడు శిష్యునియం దభిమానము చేత నా బలిచక్రవర్తియొక్క యైహిక క్షేమముగోరి "వచ్చినవాడు విష్ణుమూర్తి. ఇతని పరీక్షకు నెగ్గలేవు. ఈ దానము నీయజాలవు, కావున నీయవల" దన్నాడు. అప్పుడు శుక్రాచార్యునితో బలిచక్రవర్తి :

"ఆదిన్ శ్రీసతి కొప్పుపై, తనువుపై,
అంసోత్తరీయంబు పై,
పాదాబ్జంబులపై, కపోలతటిపై,
పాలిండ్లపై, నూత్న మ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట,
హాస్తంబు పైనుంట, మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమున్
కాయంబు నా పాయమే?" (భాగవత)

అన్నాడు. వామనుడు భూమినంతయు దన యొక పాదముతో గొలిచెను. ఆకాశమునంతయు రెండవపాదముతో గొలిచెను. మూడవ యడుగు ప్రదేశ మింక నెక్కడనున్నదో చూపుమన్నాడు వామనుడు. చేయునది లేక బలిచక్రవర్తి తన శిరమును జూపించెను. వెంటనే వామనుడు తన మొదటిపాదము నెత్తి యతని నెత్తిపై నుంచెను. అట్లు బలిచక్రవర్తిని పాతాళమున కణచెను.

మన మీ సన్నివేశమును విష్ణుకంచిలో వరదరాజస్వామి దేవాలయములో అర్చారూపములో జూచుచున్నాము. వామనుని పరీక్షకు

బలిచక్రవర్తి నెగ్గెను. వామనుడు బలిచక్రవర్తి కోరికపై ఆ పాతాళమున రక్షకుడుగా నుండి, యాతనికి భవిష్యత్కాలమున ఇంద్రుడగు నట్లు వరమిచ్చెను.

అట్లు పరీక్షించి వామనుడు బలిని బంధింపక పోయినచో, నతడింక నెట్లు పెచ్చు పెరుగునో, అది దేశముల కుపద్రవముగా వచ్చును, కావున నట్లు బలిని బంధించి యాతని కోర్కె నెరవేర్చెను.

## 6. పరశురామావతారము :

పరశురామావతారమును ఆవేశావతార మందురు. లోహపు తీగయందు విద్యుత్తావేశించినట్లు, ఆ పరశురామునియందు ఆ పరమాత్మ యంశము ఆవేశించి యున్నది. ఇది యావేశావతారము గావుననే శ్రీరాముడు యుద్ధసమయమున నా పరశురాముని వైష్ణవాస్త్రముతో పాటు ఆతనిలోని భగవదంశమును గూడ నాకర్షించెను.

కార్తవీర్యార్జును డను క్షత్రియరాజు పరశురాముని తండ్రియగు జమదగ్ని మహామునిని జంపి, యాతని కామధేనువును హరించెను. పరశురాముని తల్లియగు రేణుక భర్తృమరణమునకు నిరువదియొక్కమార్లు "రామా! రామా!" యని పరశురాముని బిలుచుచు నేడ్చినదట. అందుకని పరశురాముడు ఇరువదియొక్కసార్లు యుద్ధముచేసి, దుర్జనులగు కార్తవీర్యార్జునాది క్షత్రియరాజుల నందరను వెదకివెదకి తన పరశువుచే నరకి చంపినాడు. క్షత్రియులు తమధర్మమును విస్మరించి విశృంఖలముగా శాంతులగు బ్రాహ్మణాది సజ్జనులను చంపు దురాగతమునకు రాగా, పరశురాముడు వారినందర వధించెను. "క్షతాత్ త్రాయత ఇతి క్షత్రః" అని వ్యుత్పత్త్యర్థము. ధర్మమునకు ధర్మాత్ములకు దెబ్బ తగులకుండ రక్షింపవలసిన బాధ్యత క్షత్రియులది. అట్లు రక్షింపని రాజన్యులను అధర్మమున వర్తించు రాజులను వధించుటకై యా పరశురామావతారము వచ్చినది. కృతకృత్యమైనది.

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా"

అనునట్లు వేదవేద్యుడైన యా పరమపురుషుడే దశరథ మహారాజునకు చక్రవర్తి తిరుమగనార్‌గా జన్మించినాడు. వాల్మీకిద్వారా సాక్షాత్తుగా వేదమే రామాయణముగా నేర్పడినదని పెద్దలు చెప్పుచున్నారు.

శ్రీమద్రామాయణము గాయత్రీమంత్ర సంపుటితము. దీనిని "దీర్ఘశరణాగతి" యనియు నందురు. ఎందుకనగా అందు నెందరో శ్రీరామచంద్రుని శరణాగతి వేడినట్లు తెలియుచున్నది. శ్రీరాముడు జన్మింపక పూర్వమే 1. బ్రహ్మాదిదేవతలు వైకుంఠమునకు బోయి ఆ పరంధాముని "లోకకంటకులైన రావణాది రాక్షసులను సంహరించి, మమ్ము రక్షింపు"మని శరణాగతి చేసినారు. ఆ శ్రీమన్నారాయణు డట్లే శ్రీరామచంద్రుడుగా జన్మించి, రావణాది రాక్షసులను సంహరించెను. భరద్వాజాది సజ్జనులను సంరక్షించెను. తర్వాత తన యవతారమును చాలింపదలచి, సరయూనదిపై నడచిపోవుచున్న సందర్భములో, నెదురుగా బ్రహ్మాది దేవతలు వచ్చి "శ్రీరామా! శ్రీమన్నారాయణా! దయచేయుము నీ వైకుంఠమునకు, త్వరగా దయచేయు"మని యాహ్వానించినారు. ఈచోట సీతారాములు లక్ష్మీనారాయణులనియు లక్ష్మణు డాదిశేషుడనియు భరత-శత్రుఘ్నులు సుదర్శన-పాంచజన్యము లనియు స్పష్టముగా దెలుపబడినది.

వాచ్యముగా జెప్పుటకన్న వ్యంగ్యముగా జెప్పుటకు అలంకారికులు మెచ్చుకొందురు. ఐతే శ్రీరాముడు శ్రీమన్నారాయణుడే యని వాచ్యముగా జెప్పబడిన సందర్భములును గలవు, రెండును గలవు. పరశురాముడు శ్రీరామునితో

"అక్షయ్యం మధు హంతారం జానామి త్వాం మహేశ్వరమ్"

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా"

అనునట్లు వేదవేద్యుడైన యా పరమపురుషుడే దశరథ మహా రాజునకు చక్రవర్తి తిరుము-గనార్ గా జన్మించినాడు. వాల్మీకిద్వారా సాక్షాత్తుగా వేదమే రామాయణముగా నేర్పడినదని పెద్దలు చెప్పుచున్నారు.

శ్రీమద్రామాయణము గాయత్రీమంత్ర సంపుటితము. దీనిని "దీర్ఘశరణాగతి" యనియు నందురు. ఎందుకనగా అందు నెందరో శ్రీరామచంద్రుని శరణాగతి వేడినట్లు తెలియుచున్నది. శ్రీరాముడు జన్మింపకపూర్వమే 1. బ్రహ్మాదిదేవతలు వైకుంఠమునకు బోయి ఆ పరంధాముని "లోకకంటకులైన రావణాది రాక్షసులను సంహరించి, మమ్ము రక్షింపు"మని శరణాగతి చేసినారు. ఆ శ్రీమన్నారాయణు డట్లే శ్రీరామచంద్రుడుగా జన్మించి, రావణాది రాక్షసులను సంహ రించెను. భరద్వాజాది సజ్జనులను సంరక్షించెను. తర్వాత తన యవతారమును జాలింపదలచి, సరయూనదిపై నడచిపోవుచున్న సందర్భములో, నెదురుగా బ్రహ్మాది దేవతలు వచ్చి "శ్రీరామా! శ్రీమన్నారాయణా! దయసేయుము నీ వైకుంఠమునకు, త్వరగా దయసేయు"మని యాహ్వానించినారు. ఈచోట సీతారాములు లక్ష్మీ నారాయణులనియు లక్ష్మణు డాదిశేషుడనియు భరత-శత్రుఘ్నులు సుదర్శన-పాంచజన్యము లనియు స్పష్టముగా దెలుపబడినది.

వాచ్యముగా జెప్పుటకన్న వ్యంగ్యముగా జెప్పుటకు ఆలంకారి కులు మెచ్చుకొందురు. ఐతే శ్రీరాముడు శ్రీమన్నారాయణుడే యని వాచ్యముగా జెప్పబడిన సందర్భములును గలవు, రెండును గలవు. పరశురాముడు శ్రీరామునితో

"అక్షయ్యం మధు హంతారం జానామి త్వాం మహేశ్వరమ్"

శ్రీరామచంద్రా! నీవు మధుసూదనుడవు, పరమాత్ముడవు అని నేను తెలుసుకొనుచున్నాను." అన్నాడు. ఒక సమయములో రావణాసురుడు :

"తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్"

వీరుడగు శ్రీరామచంద్రుని నేను నిరామయ–నిరంజనుడైన శ్రీమన్నారాయణుడని యెరుగుదు" నన్నాడు.

సీతారాములు సాక్షాత్తుగా లక్ష్మీనారాయణులే యైనచో అరణ్యవాస ఘట్టములో పర్ణశాలలో సీతా రామ లక్ష్మణు లున్నప్పుడు; మారీచుడు మాయా మృగముగా రాగా వా రామాయ నెందుకు తెలిసికొనలేకపోయిరి? అనునొక సమస్య యేర్పడుచున్నది. ఆ మాయను వారెరుగకపోలేదు. ఆ కార్యగతి యట్టిది, సీత "రామ చంద్రా" ఆ బంగరులేడి చాల యందముగా నున్నది. నాకు తెచ్చి పెట్టు" మన్నది! లక్ష్మణుడు "అది మాయలేడి. రాక్షసులు కామ రూపులు. త్వరపడ" వలదని చెప్పినాడు. కాని, శ్రీరాము డామాట లను పట్టించుకోలేదు. సరే.

మొదట సీతాదేవి రామలక్ష్మణు లరణ్యవాసము చేయబోవు చున్నారని విని నప్పుడే తానుగూడ ప్రయాణమై రాజాడగా శ్రీరాముడు :- "అరణ్యవాస మతికష్టము; క్రూర మృగాదులము" అని వారించినాడు. కాని, సీతాదేవి :-

"అహం గమిష్యామి వనం సుదుష్కరం
మృగాయుతం వానర వారణైర్యుతమ్"

క్రూర మృగాలతోడను, గోలచేయు పెద్దపెద్ద కోతులతోడను నిండి, చొరశక్యముగాని యరణ్యమైనను సరే, నేను మీ వెంట తప్పక రావలసినదే" యన్నది. ఈ శ్లోకములో భవిష్యత్కథా విషయమును

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా"

అనునట్లు వేదవేద్యుడైన యా పరమపురుషుడే దశరథ మహా రాజునకు చక్రవర్తి తిరుమగనారిగా జన్మించినాడు. వాల్మీకిద్వారా సాక్షాత్తుగా వేదమే రామాయణముగా నేర్పడినదని పెద్దలు చెప్పుచున్నారు.

శ్రీమద్రామాయణము గాయత్రీమంత్ర సంపుటితము. దీనిని "దీర్ఘశరణాగతి" యనియు నందురు. ఎందుకనగా అందు నెందరో శ్రీరామచంద్రుని శరణాగతి వేడినట్లు తెలియుచున్నది. శ్రీరాముడు జన్మింపకపూర్వమే 1. బ్రహ్మాదిదేవతలు వైకుంఠమునకు బోయి ఆ పరమాత్ముని "లోకకంటకులైన రావణాది రాక్షసులను సంహారించి, మమ్ము రక్షింపు"మని శరణాగతి చేసినారు. ఆ శ్రీమన్నారాయణు డిట్లే శ్రీరామచంద్రుడుగా జన్మించి, రావణాది రాక్షసులను సంహ రించెను. భరద్వాజాది సజ్జనులను సంరక్షించెను. తర్వాత తన యవతారమును జాలింపదలచి, సరయూనదిపై నడచిపోవుచున్న సందర్భములో, నెదురుగా బ్రహ్మాది దేవతలు వచ్చి "శ్రీరామా! శ్రీమన్నారాయణా! దయసేయుము నీ వైకుంఠమునకు, త్వరగా దయచేయు"మని యాహ్వానించినారు. ఈచోట సీతారాములు లక్ష్మీ నారాయణులనియు లక్ష్మణు డాదిశేషుడనియు భరత-శత్రుఘ్నులు సుదర్శన-పాంచజన్యము లనియు స్పష్టముగా దెలుపబడినది.

వాచ్యముగా జెప్పుటకన్న వ్యంగ్యముగా జెప్పుటకు ఆలంకారి కులు మెచ్చుకొందురు. ఐతే శ్రీరాముడు శ్రీమన్నారాయణుడే యని వాచ్యముగా జెప్పబడిన సందర్భములును గలవు, రెండును గలవు. పరశురాముడు శ్రీరామునితో

"అక్షయం మధు హంతారం జానామి త్వాం మహేశ్వరమ్"

శ్రీరామచంద్రా! నీవు మధుసూదనుడవు, పరమాత్ముడవు అని నేను తెలుసుకొనుచున్నాను." అన్నాడు. ఒక సమయములో రావణాసురుడు :

"తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్"

వీరుడగు శ్రీరామచంద్రుని నేను నిరామయ-నిరంజనుడైన శ్రీమన్నారాయణుడని యెరుగుదు" నన్నాడు.

సీతారాములు సాక్షాత్తుగా లక్ష్మీనారాయణులే యైనచో అరణ్యవాస ఘట్టములో పర్ణశాలలో సీతా రామ లక్ష్మణు లున్నప్పుడు; మారీచుడు మాయా మృగముగా రాగా వా రామాయ నెందుకు తెలిసికొనలేకపోయిరి ? అనునొక సమస్య యేర్పడుచున్నది. ఆ మాయను వారెరుగకపోలేదు. ఆ కార్యగతి యట్టిది, సీత "రామ చంద్రా" ఆ బంగరులేడి చాల యందముగా నున్నది. నాకు తెచ్చి పెట్టు" మన్నది! లక్ష్మణుడు "అది మాయలేడి. రాక్షసులు కామ రూపులు. త్వరపడ" వలదని చెప్పినాడు. కాని, శ్రీరాము డామాట లను పట్టించుకోలేదు. సరే.

మొదట సీతాదేవి రామలక్ష్మణు లరణ్యవాసము చేయబోవు చున్నారని విన్నప్పుడే తానుగూడ ప్రయాణమై రాజూడగా శ్రీరాముడు :- "అరణ్యవాస మతికష్టము; క్రూర మృగాకులము" అని వారించినాడు. కాని, సీతాదేవి :-

"అహం గమిష్యామి వనం సుదుష్కరం
మృగాయుతం వానర వారణైర్యుతమ్"

క్రూర మృగాలతోడను, గోలచేయు పెద్దపెద్ద కోతులతోడను నిండి, చొరశక్యముగాని యరణ్యమైనను సరే, నేను మీావెంట తప్పక రావలసినదే" యన్నది. ఈ శ్లోకములో భవిష్యత్కథా విషయమును

కుంభినీధవు జెప్పెడి–గురుడు గురుడు
తండ్రి ! హారిజేరు మనియెడి–తండ్రి తండ్రి"

మన కరచరణా దవ్యయవా లన్నియు భగవత్సేవలోనే పాల్గొను చుండవలెను. ఇట్టి యారాధనకు సగుణ సాకార రూపములో నున్న విగ్రహములే యుపకరించును. సర్వాత్మనా భగవద్భావనలో నుండుటయే మోక్షసాధనము.

# 2. నారాయణుడే పరతత్త్వము

శ్రీమజ్జగద్గురు శ్రీరామానుజ సాంప్రదాయ యాచార్యులగు శ్రీ రాఘవాచార్య స్వామివారు, కల్యాణిపత్రికలోని "ఉపనిషదంక"కు మంగళా శాసనము చేయుచు, వ్రాసిన వ్యాసముయొక్క సారాంశము వినుడు !

అనంతము అపౌరుషేయమునగు వేదవాఙ్మయము యొక్క జ్ఞానకాండయే ఉపనిషత్సాహిత్యము. దీని యాధారములో ఆధ్యాత్మ వాదులు :

"తత్కర్మ య న్నబంధాయ,
సా విద్యా యా విముక్తయే"

ఏది బంధనము గల్గింపదో అది కర్మ; ఏది బంధనము నుండి ముక్తిగల్గించునో అది విద్య అని చెప్పిరి. మహర్షులీవిద్యాప్రకాశము లోనే అనంతము సచ్చిదానందమునగు పరబ్రహ్మము యొక్క సాక్షాత్కారము బొందిరి; ఇతరులను బొందించిరి. ఈ విద్యనే బ్రహ్మవిద్య యని, పరవిద్య యనియు జెప్పిరి. బ్రహ్మమును బొందినవారికి, బ్రహ్మము నకును గల సంబంధమును గూడ, స్పష్టపరచిరి. ప్రతిపాదన పద్ధతిలో విశేషముగా దెలియదగిన దానిని, పరంపర మొదలగు భేదములచే, స్వాభావికముగా నత డనేక రూపములు పొందియుండు విషయమును స్పష్టపరచిరి.

"రాముని మీ నాన్నగారుగా, సీతను నమ్మగా, అడవి నయోధ్యా పట్టణముగా దలంపుము, సుఖముగా వెళ్ళిరా నాయనా" అని సామాన్యార్థము. విశేషార్థము :– "దశరథు"డనగా పక్షి రథ ముగా గలవాడు, నారాయణుడన్నమాట. "మా" అనగా లక్ష్మీదేవి యని అర్థము. కావున "లక్ష్మణా! సీతారాములను లక్ష్మీ నారాయ ణులనుగా దెలిసికొనుము! (అయోధ్యయనగా వైకుంఠము అని అర్థము) ఆ లక్ష్మీనారాయణులున్న అడవియైనను అదే వైకుంఠముగా దెలిసి కొనుము, సుఖముగా వెళ్ళిరా నాయనా!" అన్నది. ఇంతకు సీతా రాములు సాక్షాత్తుగా లక్ష్మీనారాయణులే యని సారాంశము.

సీతా రామ లక్ష్మణులు దండకారణ్యములో నున్నప్పుడు, తపో వ్రతోపవాసములచే శుష్కీభూత శరీరములుగల 3. ఋషీశ్వరులు మునీశ్వరులు శ్రీరామచంద్రుని యవతారపురుషునిగా నెరిగి, ఆలింగ నము చేసికొందుమని కోరిరి. శ్రీరాముడు రావణవధ జరుగునంత వరకు దన యవతార రహస్యము బయలుపడరాదని తలంచి, ద్వాపర యుగములో నేను కృష్ణావతార మెత్తినప్పుడు మీరు గోపికలై నన్నాలింగనము చేసికొందురు గాక." యని చెప్పినట్లు అధర్వణీయ కృష్ణోపనిషత్తులో నున్నది. కావున శ్రీరామచంద్రునకు దాను నారా యణుడ నను తన యవతారజ్ఞాన మెప్పుడు నుండనేయున్నది. అట్లే తాను లక్ష్మినని సీతకు, మరియు దాను శేషుడనని లక్ష్మణునకును జ్ఞాన మున్నది.

4. గుహుడు సీతా రామలక్ష్మణులను నదిని దాటించుటకు ముందు శ్రీరామచంద్రుల పాదప్రక్షాళనము చేసి నెత్తిన జల్లకొని శరణు వేడినాడు. అతని కోర్కె తీరినది.

నంది గ్రామములో నున్న భరతుడు శ్రీరామచంద్రుని యరణ్యా వాస విషయము, తన పట్టాభిషేకము మాటను, తండ్రిగారి మరణ వార్తను విని, గంపెడు దుఃఖముతో వచ్చి ఆ యన్నగారిని తిరిగి

అయోధ్యా పట్టణమునకు వచ్చి పట్టాభిషిక్తుడవు కమ్మని వేడుకొనెను. తుదకు నీ పాదుకలనైన యిమ్మని శరణాగతి చేసెను. 5. భరతుని కోరికపై శ్రీరామపాదుకా పట్టాభిషేకము జరిగినది.

ప్రసన్నురాలగు 6. శబరి శ్రీరామచంద్రుడు వచ్చుచున్నాడని తెలిసి భక్తిపరవశయై, రుచిచూచి మధురాతి మధురములైన ఫలములనే యాతనకు నివేదించి శరణువేడినది. ఆమెకు నుత్తమలోకము ప్రాప్తించినది.

7. సుగ్రీవుడు శ్రీరామునకు వాలివలన దనకు జరిగిన యన్యాయమును జెప్పుకొన్నాడు. ఆ వాలి తన ధన మానముల హరించి, ప్రాణాపహరణమును జేయనున్నాడని చెప్పుకొని శ్రీరామచక్రవర్తిని శరణువేడెను. ఆ చక్రవర్తి తిరుమగనారు, అతని కోర్కెను నెరవేర్చెను.

హనుమంతుని సందేశములో 8. కాకాసురుడు దోషి యయ్యు శ్రీరామునికి శరణాగతి చేసినట్లు కలదు. సీతాపిరాట్టియు పురుషకార మొనర్పగా నా రాము డాతని రక్షించెను.

అట్లే 9. విభీషణాళ్వారు అన్నయగు రావణాసురుడు తన్ని వెళ్ళగొట్టిన సందర్భములో లంకానగరి నుండి వచ్చి శ్రీరాముని శరణు వేడెను. రాము డభయహస్త మిచ్చి యాతనికి లంకారాజ్యమును గట్టబెట్టెను.

ఇంక, శ్రీరాముడు, వారధి గట్టకముందు 10. సముద్రుడుప్పొంగిరాగా, బాణప్రయోగము చేయ జూచెను. ఆ సముద్రుడు శరణువేడగా నాతని దయజూచెను.

ఇట్లు సాధుపుంగవుల రక్షించి దుర్మార్గులగు ఖర–దూషణ–త్రిశిరస్క–రావణ–కుంభకర్ణాదుల శిక్షించి, ధర్మము నుద్ధరించినాడు శ్రీరాముడు. అతడు సర్వభూతముల కీక్రింది విధముగా నభయమిచ్చినాడు. ఈ శ్లోకమును శ్రీరామ చరమశ్లోక మనియు నందురు.

"సకృ దేవ ప్రపన్నాయ త వాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ"
(రామాయణము)

"ఎవడు నీవాడనని నన్ను శరణువేడునో వానికి వెంటనే నే నభయమిత్తును. సర్వభూతములకు నభయ మిచ్చుచున్నాను. ఇది నా వ్రత"మని యా రామబ్రహ్మమే శపథము చేసినాడు. రాము డెక్కడ నున్నాడు ?

"సర్వం రామమయం జగత్"

వాడు లేని ప్రదేశమే లేదు. "అంతా రామమయం; ఈ జగ మంతా రామమయం" భద్రాచలము మున్నగు దేవస్థానములందు సీతా రామ లక్ష్మణుల యర్చావైభవము చూడదగియున్నది.

## 8. బలరామ కృష్ణావతారములు :

దశావతార క్రమములో గొందరు "రామో రామశ్చ రామశ్చ" యని చెప్పుచున్నారు. మరికొందరు "రామో రామశ్చ కృష్ణశ్చ" అనియు చెప్పుదురు. బలరామకృష్ణుల నిరువురను చెప్ప వచ్చును. వీరు ఒకరివెంట నొకరుండి అవతార ప్రయోజనముల దీర్చినవారే. బలరాముని తల్లి రోహిణి, రోహిణీ-దేవకీ దేవులు వసుదేవుని భార్యలు. బలరాముడు రుక్మి-ప్రలంబాసురాది క్రూరులను సంహరించెను. శ్రీకృష్ణుడు పూతనా వత్సాసుర-బకాసుర-ధేను కాసుర-కంసాది రాక్షసులను జంపి ఉగ్రసేనాది సజ్జనులను సంత రించెను.

"కృష్ణం ధర్మం సనాతనమ్"

సనాతనమైన వేదధర్మమే శ్రీకృష్ణుడు.

"వాసుదేవ స్సర్వ మిదం న మహాత్మా సుదుర్లభ!"

ఈ కానవచ్చు ప్రపంచమంతయు శ్రీకృష్ణుడే.

"ఏకో వశీ సర్వగః కృష్ణ ఈడ్యః
ఏకోఽపి సన్ బహుధా యో విభాతి
తం పీఠస్థం యేఽనుపశ్యంతి ధీరాః
తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్"

(గోపాల పూర్వతాపనీయోపనిషత్తు)

అందర వశమం దుంచుకొనువాడు, అంతటను వ్యాపించి యున్నవాడు నగు ఆ యొక కృష్ణభగవానుడే అన్నివిధముల స్తుతింప బడదగినవాడు. వాడొకడయ్యు ననేక రూపములతో ప్రకాశించును. ధీరులైన యే భక్తులు తమముందు పీఠముపై = హృదయపీఠమున విరాజమానుడగు నా భగవంతుని ప్రతిదినమును బూజింతు వారికే శాశ్వతానందము గల్గును. ఇతరులకు గలుగదు.

శ్రీకృష్ణు డర్జునునకు గీతాధర్మము నుపదేశించి "ధర్మయుద్ధమున కంటె క్షత్రియున కితరమగు శ్రేయస్సు లేదని" చెప్పి, ధర్మయుద్ధము నకు బురికొల్పినాడు. పాండవాదులను క్షత్రియ ధర్మపరిపాలనము నడిపినాడు. ఐహిక బలమునిచ్చి, తాను స్వయముగా ధర్మపక్షపాతియై ధర్మరాజు పక్షము నవలంబించి యున్నాడు. కురుక్షేత్రమునందు మహాభారత యుద్ధము నడిపి ధర్మమునకే జయము కల్గించిన ధర్మ మూర్తి యా కృష్ణమూర్తి.

భారత-భాగవత-భగవద్గీతా ముఖ్యభాగములను స్పృశించుచు శ్రీకృష్ణావతార తత్వమును బరామర్శింతము. శ్రీకృష్ణు డెనిమిదేండ్ల ప్రాయములోనే అల్లరిచిల్లరవాడై వ్రేపల్లెలోని గోపికలను వేపుకొని తిన్నాడని యొకమాట వినవచ్చుచున్నది. అదెట్టిదో ముందు బరిశీ లింతము.

ఆ వ్రేపల్లెవాడలో "బాలురకు పాలులేవని బాలింతలు" లబ్బున మొత్తుకొనుచుండగా, శ్రీకృష్ణు డావులకు దూడలను వదలి పాలు గుడిపించినాడట. గొల్లవారి వాడలందు వారి యావుల పాలు, పెరుగు వెన్న జున్నులు తిన్నంత తిని తోడిబాలురకు బంచిపెట్టి భాండములు బగులగొట్టి పారిపోయెడి వాడట. పైగా ఆ పెరుగు వెన్నలను ఎదురైన యాయింటికోడండ్రమామాతులకు బులిమి అత్తలచే చీవాట్లు పెట్టించెడివాడట. ఇంక నేవేవో అఘాయిత్యములు చేసెడివాడట. ఇవి పైకి చాల విడ్డూరముగా గనిపించెడిమాట సత్యము. అతడెట్లు గోలచేసినను అదంతయు ఆ గోపికల నాత డనుగ్రహించుటయేనట. ఆ భాగవతములోనే,

"అనేక విధంబులైన బాలకృష్ణుడు చేయు వినోదంబులు తమయందు జేయు మహాప్రసాదంబులని యెరుంగక ఆ గోపికలు యశోదతో జెప్పి నిందించెడివారు."

అని శ్రీ శుకమహర్షి పరీక్షన్మహారాజునకు జెప్పినాడని వ్రాయబడియున్నది. కావున ఆ దుడుకు చేష్టలు గోపికలకు లాభమే కలిగించినవని తెలియుచున్నది. శాపము తగిలి ఏడు రోజులలో మోక్షము గోరి విను పరీక్షన్మహారాజునకు, గోవును పితుకునంతకాలమును వ్యర్థ కాలక్షేపము చేయని శ్రీ శుకయోగి వట్టి కొంటెచేష్టల వర్ణించుచు గూర్చుండునా? అత డెట్లు వినును? తనసీడతో నాడుకొను బాలకుని వలె తన భౌతికదేహమగు ప్రపంచములో నాడుకొన్నాడేమో! కృష్ణ భగవానుడు తదితరుల నెవరి నేమన్నాడని! ప్రపంచ మంతయు నతడే కదా!

"సర్వాగ్ం హ్యేత ద్బ్రహ్మ అయమాత్మా బ్రహ్మ" (మాం॥ ఉ)

శ్రీకృష్ణుడు "వేలుపులకె నాకంటెను" అని గొల్లల వేల్పుల గోడమీద ఎంగిలి వేయగా నొక గొల్లభామ యశోదతో జెప్పుకొన్నది. కృష్ణుని యా చేష్ట వలన భగవంతుడు సర్వాంతర్యామి విగ్రహాదులందే తప్ప ఇతరత్ర లేడను భావన తగదని వారలకు దెల్పెనని రుజువగుచున్నది.

గోపికా వస్త్రాపహారణములోని యాంతర్యము వినుడు. అవివాహితలైన గోపికలు గర్గాది మహర్షులు చెప్పుటచే శ్రీ కృష్ణు డవతార మూర్తిగా నెరిగి, ఒక ధనుర్మాసములో

"శ్రీకృష్ణుని మగనిగాగ జేయుము తల్లీ" (భాగవత)

అని కోరుచు దుర్గ నారాధించుచుండిరి. వారు "వివస్త్ర స్నానమువల్ల మీ వ్రతము చెడిపోవును గావున నాకు నమస్కరింపుడని చెప్పినను నమ్మెడి పరిస్థితిలో లేరు. వారి చీరెలు బిగబట్టినచో మాట విందురని తలచి కృష్ణుడు వారి వస్త్రము లపహరించుకొనిపోయి నీప వృక్షము నెక్కి కూర్చున్నాడు. అప్పటికిని గోపికలు బెదరించినారు. "రాజుతో జెప్పి నిన్నేమి చేయుస్తామో చూడు" మన్నారు. కృష్ణుడు "ఏదీ నీళ్ళలోనుండి బయటకు రండి ఏ రూపమున వచ్చెదరో చూతు" నన్నాడు. తుదకొక చేతితో మానరక్షణము జేసికొనుచు నొంటి చేతితో దండము బెట్టుచు బయటకువచ్చి బతిమాలుకొన్నారు. కృష్ణుడు "ఒంటిచేతి దండం భామలు ? ఒప్పదు నా మనసు."

అని రెండు చేతులతో దండము బెట్టివనే చీరెలిచ్చెద" నన్నాడు. తప్పలేదు. అట్లే సిగ్గులు విడచి గోపికలు శ్రీకృష్ణు నమస్కరించినారట. అతడు చీరెలిచ్చి వ్రతము సువ్రతమగునట్లు వారి ననుగ్రహించెను.

"వ్రతముల్ సేయుచు నొక్కమాటయిన
నెవ్వానిన్ విచారించినన్
వ్రతభంగంబులు మాను, నట్టి వరదున్
వామాక్షు లీక్షించియున్
గత చేలా ప్లవనంబు నేడు వ్రత
భంగంబంచు శంకించి, ఫా
ల తట న్యస్త కరాబ్జలై సరస
లీలన్ మ్రొక్కి ర ట్లందరున్"

"చీర లపహరించి సిగ్గులు విడిపించి,
పరిహాసించియైన బాగ మనకు
ఘనుడు నోము కొరతగాకుండ మొక్కించె
నముచు హరినుతించి రబలలెల్ల." (భాగ)

దేహాభిమానంబు దేహి విడిచెన్నగాని రక్షింపడు భగవంతుడు. ఈ దేహమే నేను. ఈ వస్తువు లన్నియు నావి అనెడి అహంకార మమకారములు వదలిన నాడుగాని ఈ జీవుని దేవుడు రక్షింపడు.

కౌరవసభలో వస్త్రాపహరణ సందర్భములో ద్రౌపది దుశ్శాసనుని వస్త్రమును విప్పనీయకుండ తన మాన సంరక్షణము తానై చేసికొను చున్నంతవరకు కృష్ణుడు వస్త్రములిచ్చి ద్రౌపదిని రక్షింపలేదు. "అనాథాం కి ముపేక్షసే?" అని రెండు చేతులెత్తి సర్వభారము నాయన యందే యుంచి నమస్కరించినప్పుడే ఆ రాధామాధవుడు చీరలిచ్చి రక్షించినాడు.

గజేంద్ర మోక్ష ఘట్టములో ఆ గజేంద్రుడు మకరినుండి తనను దాను రక్షించుకొన జూచుచున్నంతవరకు భగవంతుడు రక్షింపలేదు. "నీవే తప్ప నితఃపరం బెరుగ మన్నింపందగున్ దీనునిన్ రావే యీశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!" అన్నప్పుడే అతనిని విష్ణువు రక్షించినాడు.

"నాకు దిక్కు పురుషోత్తము డొక్కడె సుమ్ము పుల్కసా!" అన్నప్పుడేకదా ఆ భగవంతుడు రంతిదేవుని రక్షించినది! శ్రీరామ చరమశ్లోకంలో నీవాడనని శరణు వేడిననే రక్షింతునన్నాడు, శ్రీరాముడు శ్రీకృష్ణ చరమశ్లోకములో మా మేకం శరణం వ్రజ = నన్నొక్కనినే శరణుబొందుము. అప్పుడే నిన్ను రక్షింతునన్నాడు శ్రీకృష్ణుడు.

మన మిప్పటికిని వ్రతములేదు "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ తస్మాత్ కారుణ్య భావేన రక్ష రక్ష జనార్దన!" అనియే

భగవంతుని వేడుకొనుచున్నాము. దేహాభిమానము వదలి నా కా భగవంతు డొక్కడే దిక్కు దిక్కు అని నమ్మి శరణాగతి చేసిన వారినే యతడు రక్షించును. సరే. అట్లు శ్రీకృష్ణుడు ఆ గోపికలకు వ్రతభంగము గాకుండ జేసి రక్షించుటకే గోపికా వస్త్రాపహరణము చేసినాడు. కొంటె తనమునకు గాదు.

నందాదు లింద్రయాగమును ప్రతిసంవత్సరము చేయు చుండెడి వారు. ఇంద్రుడు సంతోషించినచో సస్యానుకూల వర్షము గురిసి లోకుల కన్నపానీయములు, పశువులకు మేత, నీళ్ళు పుష్కలముగా దొరుకునని ఐహికవాంఛతో వా రాయాగము జేసెడివారు. ఆ సంవత్సరమును వా రింద్రయాగము జేయ ప్రయత్నించు చుండిరి.

శ్రీకృష్ణుడు "కర్మమె సుఖ దుఃఖములకు గారణము. పరమాత్మ సర్వాంతర్యామి. సర్వజీవుల ధారణ-పోషణలు నతని యధీనములో నుండును. ఇంద్రాది దేవతలద్వారా అతడే సర్వభూతములకు సౌకర్యముగా వర్షాదు లిచ్చుచున్నాడు. ఇంద్రాది దేవతలద్వారా ఆ భగవంతునే మనము కొలువవలెను. తద్బ్రహ్మార్పణ బుద్ధితో బ్రాహ్మణాది జనులకు పశువులకు నాహార పదార్థములు పెట్టి తృప్తి నొందింపుడు. బ్రహ్మార్పణ బుద్ధితో జేసిన సర్వకార్యములును యజ్ఞములే యగును. "యజ్ఞో వై విష్ణుః" కావున సర్వాంతర్యామి యగు నా విష్ణువే మన యోగక్షేమములు వహించును" అని బోధింపగా అట్లే నందాదు లింద్రయాగము మాని, భగవత్ప్రీతికరముగా భూతతృప్తి గావింపదలచిరి. కృష్ణుడు తాను పర్వతాకారము దాల్చి, తనను బూజింపుడని చెప్పి, తానును ఆ గోపకులతో గలసి యా పర్వతమును బూజించెను; ఆహారపదార్థము లారగింపు పెట్టెను. పర్వతరూపములో తానే యా పూజలందుకొని, ఆహారపదార్థముల దానే యారగించెను. ఇట్లు

"భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా"

అను దాని పరిజ్ఞానము గల్గించెను. మరియు

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం"
అనుదాని పరిజ్ఞానమును సోదాహరణముగా దెలిపెను.

ఇంద్రునకు దన యాగము నాపినందులకు గోపము వచ్చినది. గర్వము హెచ్చినది. అతడు గో గోపి గోపకు లందరు నల్లకల్లోల మగునట్లు రాళ్ళవర్షము గురిపించినాడు. భక్తరక్షణ దీక్షా తత్పరుడగు శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతము నెత్తి వారిని దానిక్రిందికి రక్షించినాడు.

"బాలుం డీతడు, కొండ దొడ్డది,
మహాభారంబు సైరింపగా
జాలండో యని దీనిక్రింద నిలువన్
శంకింపగా బోల, దీ
శైలాంబోనిధి జంతు సంయుత
ధరాచక్రంబు పైబడ్డ నా
కే లల్లాడదు. బంధులార! నిలుడీ
క్రిందం బ్రమోదంబునన్"

అని పిలిచినాడు. నందాది గోపకులు తమ పుత్ర మిత్ర కళత్రా దులతో గోవులతో సహా, పర్వతము ఆ క్రిందికి వచ్చి నిలచి రక్షింపబడి నారు, ఇంద్రుని గర్వ మణగినది. అతడు శ్రీకృష్ణుని శరణుబొంది నీ మాహాత్మ్యము నెరుగలేక పోతిని. నన్ను గరుణింపుమని వేడుకొనగా "నాయాజ్ఞను మరువక నీ కర్తవ్యము నెరవేర్చుచుండు మని చెప్పి శ్రీకృష్ణుడు పంపించినాడు. ఈ కథవల్ల శ్రీకృష్ణుని దేవదేవత్వ మెరుక పడినది.

అఘాసురుడు పెద్దకొండచిలువ రూపముతో వచ్చి గోగోపకుల మింగిన సమయములో శ్రీకృష్ణుడును పట్టుబడి మరణించిన వారి నందరను పునస్సృష్టి చేసెను. అప్పుడు బ్రహ్మదేవుడు "సృష్టి కార్య క్రమము నాది, ఇత డెవడు సృష్టించుట" కని అహంకరించి ఆ గో

గోపీ గోపకులను తన మాయగుహలో దాచివైచెను. శ్రీకృష్ణుడు వారందరి యా రీతులుగా నుండిరో ఆయా రూపములు ధరించెను. ప్రొద్దుకుంగగా ఆ యా గోవులు గోపకులును తమ తమ గృహము లకు మామూలుగా వెళ్ళునట్లే వెళ్ళిరి. ఎవరుగాని మాగోవు రాలేదని కాని, మా పిల్లవాడు రాలేదనిగాని యనుకొన్న వారా వ్రేపల్లెలో లేరు. బ్రహ్మదేవు డీ విషయమును గనిపెట్టి ఆశ్చర్యపడి, సిగ్గిల్లి శ్రీకృష్ణుని శరణు వేడినాడు ఇట్లు శ్రీకృష్ణుని దేవదేవత్వము నా యా ఘట్టములందు చక్కగా ప్రస్ఫుటమైనది

గోపికా కృష్ణుల రాసక్రీడానందము జీవ బ్రహ్మైనం దానుభ వమే. (ఈ రాసక్రీడా తత్వము మేము రచించిన రాసక్రీడ యను పుస్తక ములో వివరముగా దెల్పితిమి).

కంసు డక్రూరునిద్వారా "ధనుర్యాగ" మను పేర బలరామ కృష్ణుల జంపుట కాహ్వానించెను. కువలయాపీడ మను మదపు టేనుగు చేతను, చాణూర-ముష్టికు లనెడి జెట్టిమల్లుర చేతను వారిని జంపింప జూచెను. వారట్లే వచ్చిరి. కాని కృష్ణుడు కువలయాపీడముతో దలపడి దానిని తొండముబట్టి గిరగిర త్రిప్పి చంపెను. కృష్ణుడు చాణూరునితో బలరాముడు ముష్టికునితో మల్లయుద్ధ మొనర్చి వారిని జంపిరి, శ్రీకృష్ణుడు కంసుని జుట్టుపట్టుకొని సింహాసనము నుండి క్రిందికి బడలాగి పైబడి గ్రుద్దిచంపెను. తాతయగు ఉగ్రసేనుని చెరవిడిపించి రాజ్య సింహాసనము నెక్కించెను. బలరామ కృష్ణులిట్లు దుష్టశిక్షణము శిష్ట రక్షణమును గావించిరి.

అట్లు కృష్ణుడు మామయగు కంసుని జంపగా కంసుని భార్యలు తండ్రియగు జరాసంధునకు దమ వైధవ్యమునకు గారణమైన శ్రీకృష్ణుని గూర్చి చెప్పి మొత్తుకొనిరి, అందుకని జరాసంధుడు కృష్ణుని మీాదికి పదునేడు మారులు దండయాత్రలు సాగించెను. తుదకు గెల్చితినని సంతోషించి వెడలిపోయెను.

తదనంతర కాలములో ఈ జరాసంధు డనేక రాజుల జయించి, వారిని దీసికొని వచ్చి తనసౌధము చుట్టును కారాగారములలో నుంచెను. భైరవమూర్తి రాజుల నందర బలి నీయదలచి యుండెను. అతడెన్నో రాజ్యముల నరాజకము చేసినాడు. అట్లు రాజలోక కంటకు డైన జరాసంధుని భీమునిచే జంపించి కారాగార బద్ధులగు రాజన్యుల నందరను విడిపించి, వారి వారి రాజ్యములకు బంపివేసెను. ఇందువల్ల వారందరును ధర్మరాజ రాజసూయమునకు దోడ్పడిరి. ధర్మాత్ముడగు ధర్మరాజునకు గప్పము గట్టుచు ధర్మమునకు లొంగియుండిరి. ఇదే శ్రీకృష్ణుని ధర్మ సంస్థాపనము.

నరకాసురు డనేక రాజ్యముల జయించి, అందమైన రాజకన్యల నందర బట్టితెచ్చి, అంగీకరించినవారిని వివాహమాడి, అంగీకరింపని వారి నందరను దన ప్రాసాదము చుట్టునుగల కారాగారము లందుంచి బాధించుచుండెను. శ్రీకృష్ణుడు సత్యభామతోగూడ గరుడవాహ నారూఢుడై పోయి అతనిని సంహరించి, యాతని కుమారుడగు భగదత్తునకు బట్టాభిషేకము చేసెను. కారాగార మందున్న పదునారువేల రాజకన్య లందర విడిపించి, వారిని వారి వారి రాజ్యములకు బంపించు ప్రయత్నము చేయుచుండెను. ఆ 16 వేల రాజకన్యలును శ్రీకృష్ణుని పాదార విందములందు మోకరిల్లి,

"కృష్ణా! మహానుభావా! గోపికా వల్లభా! నీవు సర్వజ్ఞుడవు. అవతారమూర్తివి. ఎన్నో సంవత్సరము లితని కారాగారమందు చివికి జీర్ణించినాము. మమ్మేరాజకుమారులు నమ్మి వివాహమాడుదురు? నీవే మాకందరకు భర్తవు గావలయును."

అని శరణువేడిరి. సత్యభామ అప్పటి వారి పరిస్థితిని జూచి కిక్కురుమనలేదు. శ్రీకృష్ణు డా 16 వేలమంది రాజకన్యలను మహా వైభవములో వివాహమాడెను.

ధర్మరాజు రాజసూయయాగము పూర్తి గావచ్చినది. చివరినాటి సదస్సులో అగ్రతాంబూల మెవరి కీయవలె నను సమస్య వచ్చినది. భీష్మాచార్యులు శ్రీమన్నారాయణుడు యజ్ఞపురుషుడునైన శ్రీకృష్ణుడే ప్రిప్రథమముగా బూజార్హుడని చెప్పెను. అట్లే యా ధర్మరాజు శ్రీకృష్ణుని చందన తాంబూలాది సత్కారములతో బూజింపబోయెను. "వ్యాసాది మహర్షులు, వసుదేవాది క్షత్రియ వృద్ధులు నుండగా కృష్ణున కగ్రతాంబూలము నీయరాద"ని శిశుపాలు డభ్యంతరము చెప్పెను. శ్రీకృష్ణు ననేక విధముల నధిక్షేపించెను. కృష్ణు బూజింపు మన్న భీష్మాచార్యులను, పూజించు ధర్మరాజునుగూడ చులకనజేసి తూల నాడెను. సభాసదులను చందన తాంబూలాదులచే సత్కరించి యాగ మును జక్కగా బూర్తి చేసికొనవలసిన బాధ్యతగల యజమాని ధర్మరాజు. అతడు శిశుపాలుని సమాధాన పరచుటకై శ్రీకృష్ణుని పూజార్హత నిట్లు చెప్పసాగెను.

"ఆదిజులైన బ్రహ్మయుదయుంబున
కాస్పదమైనవాడు, వే
దాది సమస్త వాఙ్మయములందు
బ్రశంసితుడైనవాడు, లో
కాది త్రిలోక పూజ్యుడని యాత్మ
నెరింగి పితామహుండు, దా
మోదరు జెప్పి బూజ్యుడని, యుక్తము
కా కిదియేమి దోసమే!" (భారత)

అని ధర్మరా జన్న మాటగూడ. శిశుపాలు డింకను ఏదేదో గొణుగుచునే యుండెను. సభా మర్యాదను ధిక్కరించి సభనుండి లేచి లేచిపోవుచున్నాడు. సహదేవున కావేళ మాగలేదు. "శ్రీకృష్ణున కర్ఘ్యమీయరా దనువీరుల నెత్తిపైన కాలు పెట్టెదనని పౌరుషముతో సహదేవు డాసభలో తన పాదమెత్తి గర్జించెను. అచట నొక్కడును

ఎదురుమాట్లాడినవారు కానబడలేదు, శిశుపాలుడింకను తన దుర్జనత్వ మును మానలేదు. భీష్మ ధర్మరాజ-శ్రీకృష్ణులను దుర్భాష లాడు చుండెను. శ్రీకృష్ణు డర్ఘ్య మందుకొని చక్రాయుధముచే నా శిశు పాలుని శిరస్సును ఖండించెను శిశుపాలుని యాత్మ యా పరమాత్మ లోనే ప్రవేశించినది. అతనిలోనుండి వచ్చిన ప్రపంచము మరల నతని లోనికే క్రమముగా జేరిపోవలెనుగదా !

శ్రీకృష్ణుడు మాయావియు దురాత్ముడునగు సాల్వుని సౌభక విమానమును గదచే బడగొట్టి తన చక్రాయుధముచే నాతని తల నరికి చంపిన సందర్భములో, ఆ శత్రువీరునితో పాటు యుద్ధ మొనర్ప వచ్చిన దంతవక్త్రుని ఆ కృష్ణుడు గదా ప్రహారముచే జంపివేసెను. ఈ శిశుపాల-దంతవక్త్రులు అసలు వైకుంఠద్వార పాలకులుగా నుండెడి జయ-విజయులు-వారు సనక-సనందనులచే శపింపబడి మూడు జన్మలయందు దుర్మార్గులై పుట్టి శాపమోక్షము నొందవలసి యున్నారు. వారు మొదటి జన్మయందు హిరణ్యాక్ష-హిరణ్యకశిపులుగా, రెండవ జన్మ యందు రావణ-కుంభకర్ణులుగా, ఈ మూడవ జన్మమునందు శిశుపాల-దంతవక్త్రులుగాను జన్మించి యిట్లు శాపమోక్షము నందిరి.

కృష్ణ భగవానుని భక్తవాత్సల్య మెంతదనగా తన ప్రతిజ్ఞను గూడ వదలి, భక్తుల అభీష్టమునే, పట్టుదలనే సాగనిచ్చును. అంతటిది. భీష్మాచార్యులు శ్రీకృష్ణుడు తనపైకి చక్రాయుధము నెత్తువరకు దన పట్టుదల వీడక, అర్జునునితో ముమ్మరముగా యుద్ధము చేసెను. దుర్యో ధనునితో నే నాయుధము పట్టను, ఊరక చూచుచుందు నన్న భగ వానుడు తన ప్రతిజ్ఞనుగూడ వదలి, ఆ భక్తుని యభీష్టమునే తీర్చును. అది భీష్మునికభీష్టము కనుకనే చక్రిని వివిధవిధముల స్తుతించెను. ఆహా,

"కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి
గగన భాగంబెల్ల గప్పికొనగ"

మొదలగు రీతుల నభివర్ణించుచు నానంద భాష్పములతో నమస్కరించెను. "ఆయుధము పట్టననగా, ముట్టుకొననే ముట్టుకొనననియా ? ఆయుధ యుద్ధము చేయునని యర్థము. అర్జునునకు పురికొల్పుటకూడ అప్పట్టున యవసరమైనది. స్వాభావికముగా భగవంతు డెప్పుడును చక్రియే. ఎట్లైన నేమి భక్తుల యభీష్టము దీర్చుటే భగవదుద్దేశ్యము.

శ్రీకృష్ణుని రాధికా లోలుడను నొక యపప్రథ యున్నది. కొందరు రాధ కృష్ణుని అత్త యనుచున్నారు. అది తప్పు. శ్రీభాగవతములో రాధ యను పేరుగలదే లేదు. బ్రహ్మవైవర్త పురాణములో, గర్గభాగవతములోను ఈ రాధికా చరిత్ర యున్నది. ఒకచోట రాధాకృష్ణులకు గోలోకములోనే వివాహమైనదని యున్నది. మరొకచోట భూలోకములోనే వివాహమైనదని యున్నది. అంతే.

బ్రహ్మదేవుడు రాధా స్మరణవల్ల జీవన్ముక్తి కల్గునని రాధోపనిషత్తులో చెప్పియున్నాడు.

"రాధా రాసేశ్వరీ రమ్యా కృష్ణ మంత్రాధి దేవతా
సర్వాద్యా సర్వవంద్యా చ బృందావన విహారిణీ।
బృందారాధ్యా రమాఽశేష గోపీ మండల పూజితా ।
సత్యా సత్యపరా సత్యభామా శ్రీకృష్ణవల్లభా ।
వృషభాను సుతా గోపీ, మూలప్రకృతి రీశ్వరీ ।
గాంధర్వా రాధికాఽఽరమ్యా రుక్మిణీ పరమేశ్వరీ ।
పరాత్పర తరా పూర్ణా, పూర్ణ చంద్ర నిభాననా ।
భుక్తి ముక్తి ప్రదా నిత్యం, భవవ్యాధి వినాశినీ ।"

(ఋగ్వేదీయ రాధోపనిషత్తు)

దుష్టశిక్షణ శిష్టరక్షణ ధర్మోద్ధరణము లొనర్చి శ్రీకృష్ణమూర్తి బలరామునితోసహా తిరిగి పరమపదమునకు వేంచేసెను. ద్వారక

మూ॥ "ఏష మ ఆత్మాఽంతర్హృదయే
ఏత ద్బ్రహ్మ। ఏత మితః ప్రేత్య
అభిసంభవితాఽస్మీతి।"

ఈ నాలోని ఇట్టి పరమాత్మయే పరబ్రహ్మము. ఈ శరీరము నుండి మరణించి వెళ్ళినమీదట నేను (= జీవుడు) ఈ బ్రహ్మమును (= ప్రాప్యమును) ప్రాప్తింతును అనియు నిశ్చయించుకొని యుపాసింప వలెను.

మూ॥ "యస్య స్యా దద్ధా నవిచికిత్సా
ఽస్తీతి హస్మాహ శాండిల్య శ్శాండిల్యః॥"

ఎవని కిటువంటి నిశ్చయముండునో, ఎవని కీవిషయములో సందేహము లేదో వానికి బ్రహ్మము ప్రాప్తించును.

## 4. ప్రాణవిద్య : ఛాం॥ 5-1-15, 5-2-1-2

"పరమాత్మ చరాచరములకును ప్రాణమైనవా"డని ఈ ప్రాణ విద్య తెల్పుచున్నది.

మూ॥ "నవై వాచో న చక్షూగుంషి
న శ్రోత్రాణి న మనాగ్ం సీత్యాచ
క్షతే, ప్రాణా ఇత్యే వాచక్షతే।
ప్రాణో హ్యేవై తాని సర్వాణి భవతి।"

సత్యకాముడు గోశ్రుతి యను శిష్యునితో నిట్లు చెప్పుచున్నాడు- ప్రాణమే ఈ వాగాది సర్వవృత్తులునై యున్నవి. కావున అన్ని యింద్రియ వ్యాపారములను సమిష్టిగా వ్యవహరించునప్పుడు వాక్కులని గాని, నేత్రములనిగాని, శ్రోత్రములని కాని, మనస్సులనికాని చెప్పుట లేదు. ప్రాణములనియే లోకమునందు శాస్త్రములందును జెప్పుట కలదు. ఈ ముఖ్య ప్రాణమే సర్వ వ్యాపారాశ్రయము. కార్య కారణ

కొనగోరకుము, ఘ్రాతయగు పరమాత్మను దెలిసికొనగోరుము! రూపమును దెలిసికొనగోరకుము, రూపమును దెలిసికొను సాక్షియగు పరమాత్మను దెలిసికొనగోరుము! శబ్దమును దెలికొనగోరకుము, శ్రోతయగు పరమాత్మను దెలిసికొనుము! అన్నపు రుచిని దెలిసికొనగోరకుము అన్నరుచి దెలిసికొను భోక్తయగు పరమాత్మను దెలిసికొనగోరుము! కర్మను దెలిసికొనగోరకుము, కర్తయగు పరమాత్మను దెలిసికొనుము! శరీర సుఖదుఃఖములను దెలిసికొనగోరకుము, శరీరమందుండి సుఖదుఃఖముల దెలిసికొను సాక్షియైన పరమాత్మను దెలిసికొనగోరుము! ఆనందము రతి సంతానము గనుటను దెలిసికొనగోరకుము, ఆనంద, రతి, సంతానోత్పత్తులకు జ్ఞాతయగు పరమాత్మను దెలిసికొనగోరుము! గమనక్రియను దెలిసికొనగోరకుము. గమనముచేయు సాక్షియగు పరమాత్మను దెలిసికొనగోరుము! మనస్సును దెలిసికొనగోరకుము, మననముచేయు మంతయగు పరమాత్ముని దెలిసికొనగోరుము!

మూ॥ "తా వా ఏతా దశైవ భూతమాత్రాః।
అధిప్రజ్ఞం దశ ప్రజ్ఞామాత్రా అధిభూతం ।
యది భూతమాత్రా నస్యుః
న ప్రజ్ఞామాత్రా స్స్యుః
యద్వా ప్రజ్ఞామాత్రా న స్యాన్న భూతమాత్రాః స్యుః । న హ్యన్యతరతో రూపం
కించన సిధ్యే న్నో ఏతన్నానాత ద్యథా!"

ఈ వాక్కు మొదలగు బాహ్యవిషయములు పదియును భూతమాత్రలు. వాగాదీంద్రియ రూపమగు ప్రజ్ఞామాత్రలు గూడ పదియున్నవి. భూతమాత్రలు లేకున్న ప్రజ్ఞామాత్రలుండజాలవు; ప్రజ్ఞామాత్రలు లేకున్న భూతమాత్రలు నుండజాలవు. విషయములు ఇంద్రియములు అను నీ రెండింటిలో ఏ యొకదాని ద్వారాకూడ మాట్లాడుట చూచుటవంటి యేపనియు జరుగదు. నేత్రాదీంద్రియములు లేకున్న రూపాది విషయములు తెలియబడవు. రూపాది విషయములు లేకున్న నేత్రాదీంద్రియములు తెలిసికోజాలవు. విషయ—ఇంద్రియములలో

డీ కల్క్యవతారమునందు అశ్వారూఢుడై వచ్చి దుష్టులగు మ్లేచ్ఛాదులను శిక్షించి, శిష్టులను రక్షించి ధర్మసంస్థాపనము చేయును.

ఒక భగవంతుడే దేవళములందు, మసీదులందు, చర్చిలందు, చైత్యములందు, సర్వత్రి యున్నాడు. ఎచ్చట నున్నను ఏరూపమున నున్నను ఆ ఒక సర్వేశ్వరుడే అందరను గాపాడుచున్నాడు. వారి వారి పూర్వ కర్మానుసారముగా వారి వారి కా యా భోజనాది పదార్థములను సృష్టించి పంచుచున్నాడు.

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః" (గీత)

ఓ అర్జునా! ఎవ రేవిధముగా నన్ను దెలిసికొని పొందుచున్నారో, వారి నావిధముగానే నే ననుగ్రిహింతును. మనుష్యు లన్నివిధాల నా మార్గమునే యనుసరించు చున్నారు.

"స తయా శ్రద్ధయా యుక్తస్త స్యాఽరాధన మీహతే
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్" (గీత)

కోరికలు కోరు భక్తుడు ఆ దేవతా సంబంధమైన విశ్వాసముతో నున్నవాడై, ఆ దేవతారాధనే చేయుచున్నాడు. ఐనను ఆ దేవతల ద్వారా నానుండియే ఇహపరములకు సంబంధించిన కోరికలను బొందు చున్నాడు" అని కలదు.

మే మొకసారి కొత్తగూడెములో నుపన్యసించుచుండగా నొక ఆర్యసమాజ వ్యక్తి యొక చీటీని వ్రాసి మా కందించెను. అందు "కొందరు రాతివిగ్రిహమును బూజింతురు. మరికొందరు ముక్కు మొగములేని రాతినే పూజింతురు. మైలురాయి నెందుకు దేవుడని పూజింపగూడదు." అని యున్నది. వచ్చినది క్రొత్త ప్రిదేశము. నిందుసభ ముందు కొద్దిగా భయము వేసినది. సమాధానము చెప్పక తప్పదు. చెప్పితిమి.

"ఎందుకు పూజింపగూడదు. మైలురాయిని గూడ బూజిం వచ్చును. దానియందును భగవంతుడు సర్వవ్యాపి యున్నాడని ప్రమాణబుద్ధి కుదరవలెనుగాని, భగవంతు నేవిధముగా నెప్పుడెవ్వ ఎట్లు పూజించినను, మంచిదే. ఆగమ శాస్త్రములలో వేదమంత్రాలతో పదునారు కళలనున్యాసము చేసిన శిలా-లోహావిగ్రహములు ఆరాధనక ప్రశస్తములని వ్రాయబడి యున్నది, భగవంతుడు ఎక్కడ లేడు ?

"అణోరణీయాన్మహతో మహీయాన్"

అణువునం దణువు కంటెను చిన్నవాడై యున్నాడు. మహత్తు నందు నంతకన్న పెద్దవాడై దాని వ్యాపించియున్నాడు.

"సర్వతః పాణిపాదం సర్వతోఽక్షి శిరోముఖమ్"

అతని పాణిపాద అక్షి శిరోముఖము లంతటను బెట్టి యున్నా డని వేదమే చెప్పుచున్నది,

"మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణి గణా ఇవ (గీత)

"ఈశా వాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథాః మాగృధ కస్యస్విద్ధనమ్"

(ఈశోపనిషత్తు)

"అంతశ్చ నారాయణః బహిశ్చ నారాయణః
సర్వ వ్యాపకో నారాయణః" (మంత్రపుష్పము)

వాసుదేవ స్సర్వమిదం సమహాత్మా సుదుర్లభః (గీత)

అని యున్నదిగదా! ఒక శివభక్తుడు రాత్రియంతయు వేశ్యా గృహమందే గడిపి నిద్రించెనట. సూర్యోదయ మగువరకు నతనికి మెలకువ రాలేదు. అతడు ప్రతిదినమును నియమముగా సూర్యోదయ

సమయమునకు శివలింగము నారాధించువాడు, ఉదయమైనది. ఇప్పు డతనికా యీశ్వరునిపై దృష్టి మరలినది. ప్రక్కనే యున్న నిద్రించు వేశ్యా స్తనము కనిపించినది. వెంటనే దానినే శివలింగముగా దలచి పూజించి ముక్తుడైనాడు. శివుడా పేరుతో ఆచంటేశ్వరుడై ఆచంట గ్రామములో వెలసినాడని మనము వినుచున్నాము. ఒక భక్తుడు తన మోకాలినే శివలింగముగా దలచి, పూజించి ముక్తుడైనా" డని చెప్పితిమి.

## ఏకేశ్వరారాధన

ఆర్యుల ఋగ్వేదమునాటికే ఏకేశ్వరారాధన అపరిపక్వముగా నస్పష్టముగా నున్నదని పిడ్డే పండితుడు చెప్పెను. దానిని రూత్ పండితుడు, దయానందుడు సంగీకరించిరి. రాజారామమోహనరాయలు "పరమేశ్వరుని కల్యాణ గుణముల ప్రతిధ్వని రూపములే ఋగ్వేదము లోని దేవత"లని తలంచెను. శాస్త్రము సామాన్య జనానీకమునకు బాహ్య పూజాదిక మేర్పాటుచేసెను. అర్హులకు ఆంతరంగిక నిగ్రహ సాధనములు నియమించెను. బాహ్యమునుండి అంతరంగికమునకు బోవుట మానవ సహజ లక్షణము. బయటి ప్రకృతి శక్తుల ఆరాధనము నుండి ఉపనిషత్తత్వ జ్ఞానము వరకు క్రమ పరిణామము నొందినది. పురాతన ప్రకృతి పూజను వదలి ఉపనిషత్తులు వేదతత్వ భావ బీజముల నుద్ధరించి నది. ప్రాపంచిక వస్తువుల జూచిన వానికి గలుగు సమస్యలకు, ఋగ్వేద ములో కవితా వేశపరులు వ్రాసిన గేయములున్నవి.

"దీవ్యతీతి దేవః" = కాంతి నిచ్చునది లేక కాంతి నిచ్చువాడు దేవుడు. లోకమునకు గాంతి నిచ్చువారు దేవతలు. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, భూమి, ఆకాశము, తల్లి, తండ్రి, గురువు, అతిధులు, సముద్రములు, ఉభయ సంధ్యలు దైవములే యనిరి. ఈ విధమైన ప్రకృతిని మొదట నుపాసించిరి.

నిశ్చల సమాలోచనపై ప్రకృతిలోని స్వరూపమును జూడసాగిరి. అద్భుత దృశ్యములకు దైవత్వ మాపాదించిరి. తుఫానులవంటి ప్రకృతి అద్భుత శక్తులను తాము నెట్టుకొనలేక బానిసలై పోయినప్పుడు వానిని దేవతలన్నారు, కొల్చినారు. వరుణుడు ఇంద్రుడు మున్నగు కొందరు దేవతలను గొప్పగా గొలిచిరి.

విదేశములందు గూడ నిట్లనేక దేవతారాధనలే యుండెడివి. క్రమముగా వారును ఏకేశ్వరారాధనను నేర్చుకొనిరి. "పాలస్తీనాలో నొక జెహోవా దేవుని గౌరవించి తక్కిన దేవతలందరను బలవంతముగా నిర్మూలించి, ఆ దేవతలను బూజించువారిని జెహోవాకు బలి యిచ్చిరి. భరత వర్షమున ఈ ఏక బ్రహ్మవాదము, ననేకత్వమును తెరమరుగున నేకత్వమును జూచి గ్రహించిరి."

(ఔట్లైన్స్ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ 13వ పేజీ)

వివిధ దేవతారాధకులగు వైదికులు, వేదాంతులనుండి సమన్వయ మార్గమును దెలిసికొన్నట్లు ఉపనిషత్తులు చెప్పుచున్నవి. అశ్వపతి, ఔపమన్యుడు మొదలగు ప్రకృతి దేవతారాధకులకు "పరమాత్ముని యంశములే ప్రకృతి దేవతలని తెల్పి, స్వర్గము పరమాత్ముని శిరము, కన్ను సూర్యుడు, వాయువు అతని శ్వాసము, ఆకాశ ముదరము, జలమాతని మూత్రనాళము, భూమి పాదము. ఇదే పరమాత్ముని విరాట్స్వరూపమని చెప్పెను. ఒక్కొక్క ప్రకృతి దేవత నుపాసించుట అతనిలోని యొక యంశమునే యుపాసించుటగును. ఇట్లు సమగ్రముగా నాతని యుపాసింపుడని చెప్పెను.

యాజ్ఞవల్క్యుడు శాకల్యునితో "3003 దైవములున్నారు. 303 దైవములున్నారు. 33 దైవములున్నారు. క్రమముగ 6, 3, 2, $1\frac{1}{2}$, 1. దేవుడొక్కడేయని చెప్పెను. "మిగిలినవన్నియు నతని విభూతులే" యనీ చెప్పెను. (కేనోపనిషత్తు "దేవతల శక్తులన్నియు పరమాత్మవే యున్నది. ఈ యుపనిషత్తు ఇంద్రుడు శక్తి ఉపాసకుడని తెల్పుచున్నది.

ఉపాసనకు పర్యాయ పదము భక్తియే. ఉపాసించు వానినే భక్తుడందురు, వేదమందనేకోపాసనములు కలవు.

## భక్తి - ప్రపత్తులు

"భక్తిరేవైనం గమయతి భక్తిరేవైనం దర్శయతి
భక్తివశః పురుషః" (ఉపనిషత్తు)

భక్తియే భగవంతుని బొందించును. భక్తియే భగవంతుని జూపించును. భగవంతుడు భక్తికి వశుడు.

"విద్యాం చాఽవిద్యాంచ యస్తద్వేదాభయం సహా
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే"
(ఈశ) (ఉ॥)

విద్యా = జ్ఞానము, అవిద్యా = కర్మము ననెడి రెంటి నెవడు తెలిసికొను చున్నాడో వాడు, (అవిద్యయా =) వర్ణాశ్రమ కర్మచే జ్ఞానోత్పత్తికి నిరోధివైన ప్రాచీనకర్మమును బోగొట్టుకొని, (విద్యయా =) జ్ఞానముచే భగవంతుని బొందుచున్నాడు.

"త మేవం విద్యా నమృత ఇహాభవతి
నాన్యః పంథా అయనాయ విద్యతే" (పురుష సూక్తము)

అతని నిట్లుపాసించిన వాడు మోక్షము పొందిన వాడగును పొందుటకు మరొక మార్గము లేదు.

"యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మ నా
శ్రద్ధావాన్ భజతే యో మాం సమే యుక్తతమో మతః (గీత)

యోగు లందరిలోకి భగవంతుని శ్రద్ధతో భజించువాడు యోగ్యుడగును.

"నాహం వేదై ర్నతపసా న దానేన న - చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నపి మాం యథా"

"భక్త్యా త్వ నన్యయా శక్య అహ మేవం విధోఽర్జున !
జ్ఞాతుం ద్రష్టుచ తత్వేన ప్రవేష్టుం చ పరంతప!"

నేను వేదములచేతగాని, తపస్సు చేతగాని, దానము చేతగాని యజ్ఞముచేతగాని, నీవు నన్ను ఇప్పుడు చూచినట్లు జూచుటకు సాధ్యపడువాడగాను. నాయందలి భక్తిచేత మాత్రమే యథార్థముగా దెలిసికొనుటకు, చూచుటకు ప్రవేశించుటకును శక్యుడ నగుదును.

"న సందృశే తిష్ఠతి రూప మస్య న చక్షుసా పశ్యతి కశ్చనైనం,
భక్త్యాచ ధృత్యాచ సమాహితాత్మా
జ్ఞాన స్వరూపం పరిపశ్య తీహ" (భారత)

ధృతిచే సమాహితాత్ముడై భక్తిచే పురుషోత్తముని జూచును. సాక్షాత్కరించుకొనును, పొందును. ఈ భగవంతుని రూపము కనబడునదిగాదు, కావున నితని నెవడును దన చర్మ చక్షుస్సులచే జూడజాలడు." అని వ్యాసుడు మోక్షధర్మ పర్వమున జెప్పినాడు. భక్తిరస ప్రాశస్త్యమును శ్రీ భాగవతము వేనోళ్ళ గొనియాడినది,

"అంధేందూదయముల్, మహాబధిర
శంఖారావముల్ మూక స
త్సింధాఖ్యాపనముల్ నపుంసక వధూ
కాంక్షల్ కృతఘ్నావలీ
బాంధవ్యంబులు భస్మహవ్యములు
లుబ్ధ ద్రవ్యముల్ క్రోడ స
ద్గంధంబుల్ హరి భక్తి వర్జితుల
రిక్తవ్యర్థ సంసారముల్" (శ్రీ భాగవత)

భక్తి ప్రపత్తులు రెండును భగవదనుగ్రహమును బొందుటకు ముఖ్యములే. భక్తి మార్గమునకు సాధనమును ముఖ్యావశ్యకము. ప్రపత్తి మార్గమునకు త్రికరణశుద్ధిగా భగవంతు నాశ్రయించు టత్యావశ్యకము, సాధనకూడా చేయవచ్చును. పాంచరాత్రాగమము ప్రపత్తి కారు అంగము లున్నవని తెల్పుచున్నది.

> "ఆనుకూల్యస్య సంకల్పం ప్రాతికూల్యస్య వర్జనం
> రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వ వరణం తథా
> ఆత్మ నిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతిః" (లక్ష్మీ తంత్రము)

తన సంకల్పమునకు దగిన శ్రేయ మొనగూర్చు భగవ దనుగ్రహమును సంపాదించుట, ప్రతికూల విషయముల వర్జించుట, అతడు తనను తప్పక రక్షించు నన్న నమ్మకము, అతనిని గోప్యముగా నాశ్రయించుట, అభిమానమువదలి దీనుడై వేడుట. తన నాతని ముందుంచుట.

## నవ విధ భక్తులు

శ్రీమద్భాగవతములో నవవిధ భక్తులు తెల్పబడినవి.

> శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
> అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్"

1. శ్రవణ మనగా, భగవదనుగ్రహము నపేక్షించుచు నాతని నామ రూప గుణలీలా కథా మహాత్మ్యములను వినుట.

2. కీర్తన మనగా, భగవంతుని నామరూప సర్వవ్యాపకత్వాదుల గాన మొనర్చుట.

3. స్మరణ మనగా, భగవంతుని గుణ నామ రూప సర్వవ్యాపకత్వాదుల స్మరించుట.

4. పాదసేవన మనగా, భగవంతుని శ్రీ పాదములను వత్తుచున్నట్లు, పూజించుచున్నట్లు, మనస్సున దలంచుట, అర్చామూర్తి పాద పూజచేయుట.

5. అర్చన మనగా, భగవదర్చారూపములను అంగములను కుంకుమతో అక్షతలతో పుష్పములతో బూజించుట సహస్రనామ-అష్టోత్తర నామాదులచే త్రికరణశుద్ధిగా బూజించుట; షోడశోపచార పూజయగును.

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః" (గీత)

పత్రముగాని పుష్పముగాని, ఫలముగాని జలముగాని ఎవడు నాకు భక్తితో సమర్పించునో అట్టి పరిశుద్ధాత్ముడిచ్చిన యా వస్తువుల, నేననుభవింతును" అని భగవానుడే యన్నాడు. మానసిక పూజయును ఈ యర్చన క్రిందికే వచ్చును.

6. వందన మనగా, భగవన్మహిమనే తలంచుచు నమ్రుడై భగవంతునికి నమస్కరించుట, అంజలించుట.

7. దాస్య మనగా భగవద్భాగవతాచార్యుల యానతిని శిరసావహించి కింకరుడై తదనుకూలముగా సేవించుట.

8. సఖ్య మనగా, స్నేహితునకు సులువుగా దన మనోభిప్రాయము దెల్పునట్లు భగవంతుని సన్నిధానములో దన మనోభిప్రాయమును వెల్లడించుట. నిర్భయముగా రక్షింపుమని బ్రతిమాలుకొనుట.

9. ఆత్మనివేదన మనగా, నేను నీవాడనేయని తన నా భగవంతుని ముందు - సమర్పించుకొనుట దీనిని ప్రణిధానమని, ప్రపత్తియని, భరన్యాసమని, శరణాగతియనియు నందురు.

ఆళ్వార్లందరును ఈ నవవిధభక్తుల గూర్చి తమ గ్రంథము లందు చక్కగా దెల్పినారు. ఈ యాళ్వారుల ననుసరించి రామానుజులును భక్తి ప్రపత్తులకే భగవంతుడు సాధ్యుడని తమ గ్రంథము లందు దెలిపిరి. శరణాగతి గద్య, వైకుంఠగద్య, రంగరాజగద్యలు భక్తులు భగవంతు ననుసంధించుటకై రచించిరి.

రామానుజకాలానంతరమున శ్రీవైష్ణవము వడగలై - తెంగలై యను రెండు శాఖలైనది. భగవదనుగ్రహము సహేతుకమని తలంచువారు వడగలై శాఖవారు. నిర్హేతుకమని తలంచువారు తెంగలై శాఖవారు. వడగలై శాఖయొక్క ప్రపత్తి మార్గమునకు ఉదాహరణము మర్కట కిశోర న్యాయము. తెంగలై శాఖయొక్క ప్రపత్తి మార్గమున కుదాహరణము మార్జాల కిశోరన్యాయమునని యందురు.

## అర్థపంచక జ్ఞానము

విశిష్టాద్వైత సాంప్రదాయము వారికి అర్థపంచక జ్ఞాన మత్యావశ్యకమైనది

1. ఆత్మ స్వరూపజ్ఞానము – జీవుడు భగవంతునకే దాసుడై యుండును. "శేషత్వమాత్మాపుక్కు స్వరూపం" అని తెలిసికొని యుండుట.

2. పరమాత్మ స్వరూపజ్ఞానము – భగవంతుడు జీవుల నన్ని విధముల రక్షించువాడై యున్నాడని తెలిసికొనుట.

3. ఫల స్వరూపజ్ఞానము – సంపాదించవలసినది మోక్షమని తెలిసికొని యుండుట.

4. ఉపాయ స్వరూపజ్ఞానము – భగవంతుడే గతియని నమ్మి శరణాగతి చేయుట.

5. విరోధి స్వరూపజ్ఞానము-మోక్షమున కాటంకము గల్గించు వాని నెరిగి యుండుట.

ఈ యైదర్థములను తిరుమంత్రమునందు జక్కగా నిమిడి యున్నవి. తిరుమంత్రిమును మించిన మంత్రము లేదు. ఇది వేద సంబంధ మంత్రిము. ఆచార్యులను సమాశ్రియించి యా మంత్రము నుపదేశము పొందవలెను. ఈ మంత్రిము ననుష్ఠించుటకు నన్ని వర్ణములవారికి నధికారము కలదు.

## నవ విధ సంబంధములు।

జీవాత్మకు పరమాత్మకును నవవిధ సంబంధము లున్నవి.

"పితాచ రక్షక శ్శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః
స్వామ్యాధారో మహాత్మాచ భోక్తా చాద్య మనూదితః"

1. పితాపుత్ర సంబంధము : తండ్రికి కుమారునకు గల సంబంధము వంటి సంబంధము జీవాత్మకు పరమాత్మకను గలదు. కోరకున్నను కుమారుల క్షేమమునకై తగిన కార్యములు చేసి తండ్రి రక్షించునట్లే జీవుల యోగక్షేమముల నతడు వహించును.

"సర్వయోనిషు కౌంతేయ మూర్తయస్సంభవంతియాః
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా" (భ. గీత)

అర్జునా! అన్ని యోనులందు నేయే యాకారములు పుట్టుచున్నవో వానికన్నిటికి ప్రకృతి తల్లి. దానియందు బీజముంచు తండ్రిని నేనే.

2. రక్ష్య రక్షక సంబంధము : రక్షించు వానికి రక్షింపబడు వానికి గల సంబంధము. భగవంతుడు సర్వరక్షకుడు. శరణు వేడిన, మిత్రినే కాదు శత్రువునైనను రక్షించువాడు.

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ర్వతం మమ"

అన్నాడు శ్రీరామావతారమున భగవంతుడు.

"సర్వజ్ఞ స్సర్వగో భువనస్య గోప్తా" (శ్వేతా) (ఉ.)
సర్వజ్ఞుడు సర్వవ్యాపియునగు భగవంతుడే ప్రపంచ రక్షకుడు.

3. శేష శేషి సంబంధము : (శేషుడు = ) సేవకుడు. జీవుడు పరమాత్మ యధీనమందుండి యాయన వినియోగమునకు లోబడి యుండువాడు. జీవులందరి సేవను బొందువాడు పరమాత్మ! కావున, పరమాత్మ శేషి శేషత్వము జీవాత్మ యొక్క స్వరూపము. "శేషత్వమాత్మాపుక్ష స్వరూపం" అని తిరుమంత్రార్థము చెప్పెను.

"భీషా స్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః
భీషా దగ్ని శ్చేంద్ర శ్చ మృత్యు ర్థావతి పంచమః (త్రై) (ఉ)

భగవత్సేవకు లోపమగు నను భయముచేతనే, వాయు సూర్య వహ్ని దేవేంద్ర యమధర్మరాజు లందుగల జీవులు, తమ తమ నిర్ణీత కార్యక్రమమును విడువక చేయుచున్నారు.

4. భర్తృ భార్యా సంబంధము : భార్య నన్నివిధాల సంతోష పెట్టుచు భరించువాడు భర్త. భరింపబడుచు తదనుకూలముగా నుండవలసినది భార్య. జీవుడు "తనను భరింపజాలినవాడు శ్రీమన్నారాయణుడు తప్ప మరొకడు లేడని తలంపవలెను. ఇట్టి సంబంధమునే భర్తా భార్యా సంబంధమందురు.

ఆ పరమాత్మ తానే రెండుగా నైనాడట. ఒక భాగము పతి. రెండవ భాగము పత్ని.

"స ఏకాకీ నరమతే! స ద్వితీయమైచ్ఛత్
సః పతిశ్చ పత్నీ చా భవతామ్"

ఆ భగవంతు డొకడే పురుషుడు. బ్రహ్మ మొదలు తక్కిన ప్రపంచమంతయు స్త్రీ ప్రాయమే,

"స్త్రీ ప్రాయ మితరం సర్వం జగత్ బ్రహ్మ పురస్సరమ్"
అనిగదా ప్రమాణము. అతడు జగన్నాథుడు.

5. జ్ఞాతృ జ్ఞేయసంబంధము : (జ్ఞాత) తెలిసికొనువాడు-జీవుడు. (జ్ఞేయుడు -) తెలియబడు వాడు భగవంతుడు. నిత్యుడు ఆత్మయం దుండువాడునగు భగవంతుడు. తెలియదగినవాడు. ఈతనికన్న తెలిసికొనదగినది వేరేదియును లేదు.

"నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్"

తెలిసికోదగిన వానిలో గొప్పవాడు. సమస్త ప్రపంచమునకు నాత్మయై యుండువాడు. భూతకోటికి పరమగమ్య స్థానమైనవాడు నారాయణుడు.

6. స్వ స్వామి సంబంధము : స్వ = సొమ్ము జీవుడు [స్వామి] సొమ్ముగలవాడు భగవంతుడు. సొమ్ముగలవాడు దానిని పదిలపరచి రక్షించి చెడకుండగా పాడి వృద్ధి పరచి తనకు సంతోషకరముగా నుపయోగించుకొనును. అట్లే భగవంతుడును జీవుని రక్షించి, యతని యోగక్షేమమును వహించి తన ప్రియోజనమునకు వినియోగించుకొనును. భక్తరక్షణమే భగవంతునికి ప్రయోజనము, కాన తన రక్షకత్వమును స్థాపించుకొనుటకై జీవుల రక్షించును.

"పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్"

సమస్త ప్రపంచమునకు స్వామియై జీవాత్మకు నాయకుడై నిత్యుడై మంగళకరుడై శ్రీమన్నారాయణు డుండును. ప్రకృతి జీవులకు పతియై కళ్యాణగుణములు గల యీశ్వరుడై యుండును.

7. ఆధారాధేయ సంబంధము : ఆధారము = ఏదేని యొక పదార్థమును ధరించునది. పరమాత్మ ఆధేయము ధరింపబడు పదార్థము. జీవుడు. జలమున కాధారము పాత్రయైనట్లు జీవున కాధారము పరమాత్మ. ఆధేయము జీవు డనవలెను. ఇట్టి సంబంధమును ఆధారాధేయ సంబంధ మందురు. సర్వాధారుడు పరమాత్మయని నమ్మి యుండవలెను.

–యస్య ప్రాణ శ్శరీరం–యస్య వా
క్శరీరం–యస్య చక్షు శ్శరీరం–
యస్య శ్రోత్రగ్ం శరీరం–యస్య
మన శ్శరీరం–యస్య త్వ క్శరీరం
–యస్య విజ్ఞానగ్ం శరీరం–
యస్య రేత శ్శరీరం"

అట్లు భూమి ఉదకము అగ్ని అంతరిక్షము వాయువు ద్యులోకము ఆదిత్యుడు దిక్కులు చంద్రుడు నక్షత్రములు ఆకాశము తమస్సు తేజస్సు మొదలగు ద్యులోక సంబంధ సమస్త భూతములందుండు ప్రాణము, వాక్కు, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, త్వక్కు, విజ్ఞానము, రేతస్సు మొదలగు ఆత్మీయ పదార్థములందు నున్నదియు పైవాని నన్నింటి నియమించునదియు నగు ఒక వస్తువును నిర్దేశించి, అదియే నీకును ఆత్మ, అంతర్యామి, అమృతస్వరూపుడు నని కాణ్వులు ప్రతి పర్యాయ ముపదేశించిరి. మాధ్యందినులు

మా॥ "య స్సర్వేషు లోకేషు తిష్ఠన్ –
య స్సర్వేషు వేదేషు తిష్ఠన్ –
య స్సర్వేషు యజ్ఞేషు తిష్ఠన్"

అని లోకాలయందు, వేదాలయందు, యజ్ఞాల యందు నుండువాడనియు ఉపదేశించిరి. కాణ్వులు, "యో విజ్ఞానే తిష్ఠన్" అను దానికి బదులుగా, మాధ్యందినులు "య ఆత్మని తిష్ఠన్ ... స త ఆత్మాంతర్యామ్యమృత" అనియు నుపదేశింతురు. విజ్ఞానము = ఆత్మ. ఇరువురును "ప్రత్యగాత్మను పరమాత్మ నియమించు వా"డనియే చెప్పుచున్నారు. కావున జీవాత్మలు పరమాత్మకన్న వేరైనవారే. పరమాత్మ నారాయణుడే. అతడే సర్వాత్మ.

3. పేయాళ్వారు :

"తులా శతభిష గ్జాతం, మయూర పురి కైరవాత్,
మహాంతం మహ దాఖ్యాతం వందే, శ్రీ నందకాంశజమ్"

4. తిరుమడిశై ఆళ్వారు :

"మఖాయాం మరిరే జాతం చక్రాంశం భార్గవోత్తమం,
మహీసార పురాధీశం భక్తిసార, మహాం భజే॥

5. పెరియాళ్వారు :

"జ్యేష్ఠా స్వాతీభవం, రథాంశం, ధన్వినః పురే,
ప్రపద్యే, శ్వశురం విష్ణోః, విష్ణుచిత్తం పురశ్శిఖమ్॥

6. కులశేఖరాళ్వారు :

"కుంభే పునర్వసౌ జాతం, కేరళే చోళ పట్టణే.
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర, మాశ్రయే॥

7. తిరుప్పాణి ఆళ్వారు :

"వృశ్చికే రోహిణీ జాతం, శ్రీపాణం నిచుళా పురే,
శ్రీవత్సాంశం గాయకేంద్రం ముని వాహన, మాశ్రయే॥

8. తొండరడిప్పొడి ఆళ్వారు :

"కోదండే జ్యేష్ఠ నక్షత్రే, మండంగుడి పురోద్భవం,
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపద్రేణు, మాశ్రయే॥

9. తిరుమంగై ఆళ్వారు :

"కార్తికే కృత్తికా జాతం, చతుష్క విశిఖా మణిం,
షట్ప్రబంధ కృతం, శార్ఙ్గమూర్తిం కలిహా, మాశ్రయే"

10. నమ్మాళ్వారు :

"వృషభేతు విశాఖాయాం, కురికాపురి కారిజం,
పాండ్యే దేశే కలే రాదా, శఠారిం సైన్యపం, భజే॥

11. మధురకవి యాళ్వారు :

"చైత్రే చిత్రా సముద్భూతం, పాండ్య దేశే, గణాంశ జం
శ్రీ పరాంకుశ సద్భక్తం మధురం కవిం, మాశ్రయే॥

12. రామానుజులు :

"మే షార్ద్రా సంభవం, విష్ణో ర్దర్శన స్థాప నోత్సుకం,
తుండీర మండలే, శేష మూర్తిం రామానుజం, భజే"

# రహస్య త్రయము

## తిరుమంత్రార్థము

మోక్షము గోరువారు తెలిసికోవలసిన రహస్యాలు మూడు. అందులో మొదటి రహస్యము తిరుమంత్రము. రెండవ రహస్యము ద్వయమంత్రము. మూడవ రహస్యము చరమశ్లోకము. ఇప్పుడు తిరుమంత్రము గూర్చి తెలిసికొందము. తిరుమంత్ర మనగా శ్రేష్ఠమైన మంత్రము. దీని గొప్పతనము తెలిసికొని, తగిన భక్తిశ్రద్ధలతో దీని చింతనము చేయవలెను. ఈ మంత్రమందు, ఈ మంత్రమందలి భగవంతునియందు, మంత్రి ముపదేశించిన ఆచార్యుల యందును ఎంత భక్తిశ్రద్ధలు చూపిన, అంత లాభము కలుగును.

సంసారులు భగవంతుడు ప్రభువని తాము సేవకుల మనియు మరచి, భగవంతుని సేవించు భాగ్యమును బోగొట్టుకొని, పోగొట్టుకొంటిమే యను దుఃఖమును లేక సంసార సముద్రంలో బడి కొట్టుకలాడుచున్నారు. భగవంతుడు దయామయుడు గనుక, వీరు తనను

తెలిసికొని మోక్షము బొందుటకు వీలు గలిగించెను. తానే బదరి కాశ్రమమున నారాయణుడుగా బుట్టి, తన యంశమున బుట్టిన నరునకు మొట్టమొదట నీ మంత్రముపదేశించెను.

ఇట్లా భగవంతుడే ఆచార్యుడు శిష్యుడునై, తిరుమంత్రము నందరకు దెలియజేసెను. శిష్యుడుండవలసిన విధానము కూడ లోకమునకు దెలియవలెను గదా! అందుకనే శిష్యుడుగాకూడ నైనాడు. స్వయముగా పాటుపడి ధనము సంపాదించుకొను టెంత కష్టమో, సర్వ శాస్త్రములు చదివి వానిద్వారా జ్ఞానము సంపాదించుకొనుటంత కష్టము. తాతలంద్రులు సంపాదించిపెట్టిన ధనమువలె తిరుమంత్రము వల్ల గల్గు జ్ఞానము సులభము. భగవంతుని గూర్చిన మంత్రాలనేకము లున్నవి. వానిని ముఖ్యముగా రెండు విధము లనవచ్చును.

1. వ్యాపక మంత్రములు.

2. అవ్యాపక మంత్రములు.

అంతటను వ్యాపించియుండు భగవంతుని స్వరూపము దెల్పునవి వ్యాపక మంత్రములు. భగవంతుని అవతారములు, గుణములు, చేష్టలు మొదలైనవానిలో ఒక్కొక్క దానిని, లేదా కొన్నిటిని దెల్పునవి అవ్యాపక మంత్రములు. అవ్యాపక మంత్రములకన్న వ్యాపక మంత్రములు అగు

1. ఓం నమో నారాయణాయ,

2. ఓం నమో భగవతే వాసుదేవాయ,

3. ఓం నమో విష్ణవే,

అను మూడును శ్రేష్ఠమైనవి.

వీనిలోను 'ఓం నమో నారాయణాయ' అను తిరుమంత్రమే ముఖ్యము. మిగిలిన రెండును మనను రక్షించు కల్యాణ గుణములు

తెలుపుట లేదు. వానిని శిష్టులు పరిగ్రహించుటయు లేదు. అవి భగవంతుని ఆరు విధములగు సమర్థతలను దెలుపుట లేదు. సంపూర్ణమైన యర్థమును వెలువరించుట లేదు. ఇందుకని ఈ రెండు మంత్రాలును తిరుమంత్రముకన్న తక్కువవే.

తిరుమంత్రమును వేదాలు ప్రశంసించినవి. ఋషులు, ఆళ్వారులును మంచిదని గౌరవించిరి. భగవంతుని మహాత్మ్యం వేరు, ఈ తిరుమంత్రపు మహాత్మ్యం వేరు. భగవంతు డెక్కడనో యుండును. ఈ మంత్రము మన దగ్గరనే యుండి ఉపకారము చేయుచుండును. ద్రౌపది కాపద సమయములో వస్త్రములిచ్చి రక్షించినది ఈ తిరుమంత్రమే కదా! కోపముతో దలంపుము, భయముతో దలంపుము, భక్తితో దలంపుము ఈ మంత్రములోని పదములను మార్చి తలంపుము! ఎట్లు దలచినను ఈ మంత్రము తన రక్షించు స్వభావమును విడువదు. రక్షించి తీరును.

తిరుమంగయ్యాళ్వారు ( "కులందరుం" = ) గొప్ప కులము నిచ్చును అనుచోటున జెప్పినట్లు, మన కోర్కెల నన్నింటిని ఇది తీర్చును. ఐశ్వర్యము కోరువారి కైశ్వర్యము, మోక్షము గోరువారికి మోక్షము, ఏది కోరినవారి కది సంపాదించిపెట్టును. కర్మిష్ఠులకుగాని జ్ఞానులకుగాని, భక్తులకుగాని అడ్డమువచ్చు నాటంకము లన్నిటిని బోగొట్టి, తగిన ఫలములను సాధించిపెట్టును. "నీవే నాకు దిక్కని" శరణాగతి చేసిన ప్రపత్తినిష్ఠులకు, ఆ ప్రపత్తికి దగిన జ్ఞానము (భగవంతునకు దాసుడుగా నుండవలసిన ఆత్మను గూర్చిన జ్ఞానమును) గల్గించి, పొద్దుపుచ్చుటకును, ఆనందం గల్గించుటకును ఈ తిరుమంత్ర ముపయోగించును.

"మత్తెల్లాం పేశిలుం" అనుచోట చెప్పినట్లు ఆత్మను బాగుచేసికొనుటకు గావలసిన ఐదు అర్థములును తిరుమంత్రంలో నున్నవి. వీనినే అర్థపంచక మందురు.

చర్యము, యజ్ఞాద్యనుష్ఠాన విధులు, అన్నియును బుట్టినవి. అతడే అందరకు అన్నింటికి గారణము.

మూ॥ "సప్త ప్రాణాః ప్రభవంతి తస్మా
త్సప్తార్చిష స్సమిధ స్సప్త హోమాః,
సప్త ఇమే లోకా యేషు చరంతి ప్రాణా
గుహాశయా నిహితా స్సప్త స్సప్త ।"

అతనినుండియే ముఖ్యేంద్రియములు 7, చూచుట మున్నగు విషయముల గ్రహించుశక్తులు 7, రూపము మున్నగు విషయములు 7, ఈ ఇంద్రియములందు ప్రదేశములు 7, ఈ ప్రదేశము లందుండియే ఇంద్రియములు తమతమ పనులు చేసికొనుచుండును, నిద్రా సమయములో మనస్సుతో గలసి ఏకమై హృదయములో శయనించును. ఈ 7, 7 అయిన గుంపులు పరమాత్మని ద్వారానే అన్ని ప్రాణులయందు మంచబడినవి.

మూ॥ "అత స్సముద్రా గిరయశ్చ సర్వే
అస్మా త్స్యందంతే సింధవ స్సర్వరూపాః,
అతశ్చ సర్వా ఓషధ యోరసశ్చ
యేనైష భూతై స్తిష్ఠతే హ్యంతరాత్మా ।"

ఇతనినుండియే సముద్రాలు, పర్వతాలు పుట్టినవి. ఇతనినుండి ప్రకటమై, అనేక రూపములైన నదులు ప్రవహించుచున్నవి. అన్ని ఓషధులు రసములును బుట్టుచున్నవి. ఈ రసముచే బుష్టినొందిన శరీరములలో సర్వాంతరాత్మ యగు పరమాత్మ అన్ని ప్రాణులయొక్క ఆత్మలతో సహా, ఆయా ప్రాణుల హృదయాలతో నుండుచున్నాడు.

మూ॥ "పురుష ఏవేదం విశ్వం కర్మ తపో
బ్రహ్మ పరామృతం, ఏత ద్యో వేద
నిహితం గుహాయాం సోఽవిద్యాగ్రంథిం
వికిరతీహ సోమ్య॥"

పై విధమగు సంయమ రూపమగు సాధనము, బాహ్యసాధనముల ద్వారా తెలిసికొను కృత్యములు, పరమామృత రూప బ్రహ్మము. ఈ మొత్తమన్నియును పరమపురుషుడైన పరమాత్మయే-ఓప్రియశ్వానకా ఈ హృదయ గుహలోనున్న అంతర్యామియగు పరమాత్మ నొకని దెలిసికొన్నచో ఈ మనుష్య శరీరమందే అనుమానపు ముడులు విడిపోయి, ఈ కార్యజాతమగు ప్రపంచమంతయు దెలియును, భగవత్ప్రాప్తి కలుగును.

## 15. అంగుష్ఠ ప్రమిత విద్య : కఠ॥ 2-1-12, 13. 3-2-17.

పరమాత్మ డంతర్యామి రూపముగా నందరి హృదయములందు నున్నాడని ఈ అంగుష్ఠ ప్రమితవిద్య తెల్పుచున్నది. యమధర్మరాజు నచికేతునితో ననుచున్నాడు: పరమాత్మ అంతట నిండియున్నను హృదయమునందు విశేషముగ నిండియున్నాడు. అతడు కేవలముగ స్థూలుడుగాని సూక్ష్ముడుగాని కాడు. ఏదేని యొక్క పరమితిగల రూపముగల వాడుగాడు. వేదాంతము మనుష్యుల నుద్దేశించియే చెప్పబడెను. మనుష్యులే ఉపాసన కర్తలు. కావున సాధకుల హృదయ పరిమితిని బట్టి అందలి పరమాత్మ అంగుష్ఠ మాత్రుడని చెప్పబడును.

మూ॥ "అంగుష్ఠ మాత్రః పురుషో మధ్య
ఆత్మని తిష్ఠతి, ఈశానో భూత
భవ్యస్య న తతో విజుగుప్సతే
ఏత ద్వై తత్ ।"

అంగుష్ఠమంత పరిమాణముగల పరమపురుషుడు ఉపాసక శరీరములోని హృదయాకాశమం దున్నాడు. అతడు త్రికాలములందును శాసనము చేయుచున్నాడు. కాలత్రయ మందుండు పదార్థముల జీవుడు నియమింపలేడు కావున జీవునకంటె పరమాత్మ వేరు. అతని దెలిసికొన్న మీదట సాధకు డెవరినిగాని నిందింపడు. అతని గూర్చియే నీవు నన్నడిగినావు.

మూ॥ "అంగుష్ఠ మాత్రః పురుషో జ్యోతి
రి వాఽధూమకః । ఈశానో భూత
భవ్యస్య స ఏ వాద్య స ఉ శ్వః
ఏత ద్వై తత్."

అంగుష్ఠమంత పరిమాణముగలవాడు, పరమపురుషుడునగు పరమాత్మ, పొగలేని జ్యోతివలె బ్రకాశించు చున్నాడు; త్రికాలములందును శాసనము చేయుచున్నాడు; అతడే యిప్పుడున్నాడు, ఇకముందు నుండగలడు. (వాడు నిత్యుడు, సనాతనుడు) అతని విషయములోనే నీవు నన్నడిగినావు.

మూ॥ "యు దిదం కించ జగత్సర్వం ప్రాణ
ఏజతి నిస్సృతం । మహద్భయం వజ్ర
ముద్యతం య ఏత ద్విదు రమృతా స్తే భవంతి ।"

పరమాత్మ నుండి బయలు వెడలిన ఈ ప్రపంచ మంతయును ఆ ప్రాణ స్వరూపుడైన పరమాత్మయందే చేష్టలు చేయుచున్నది. ఎత్తిన వజ్రాయుధము వంటి మహా భయస్వరూపుడైన (సర్వశక్తి మంతుడైన ఈ పరమేశ్వరు నెరిగినవారు అమృతు లగుదురు. జనన మరణముల నుండి విడివడుదురు.

మూ॥ "భయా దస్యాగ్ని స్తపతి భయా
త్తపతి సూర్యః భయా దింద్రశ్చ
వాయుశ్చ మృత్యు ర్ధావతి పంచమః"

ఇతని భయమువలననే అగ్ని కాల్చుచున్నాడు. ఇతని భయమువలననే సూర్యు డెండ గాయుచున్నాడు. ఇతని భయమువలననే ఇంద్రుడు వాయువు యమధర్మరాజును తమతమ కార్యములందు జాగరూకులై యుండుచున్నారు. ప్రపంచము అగ్నిసూర్యాదులును [జీవాత్మలు] ఆ ప్రాణ స్వరూప సర్వేశ్వరుని యాధారమున నుండుచున్నారు, వానిలో నుండి వచ్చుచున్నారు, వాని యాజ్ఞ నతిక్రమించిన యేమగునో




నారాయణుని కొరకు + ఏ, జీవాత్మ

నారాయణుని కొరకే జీవాత్మ (దాస్యము చేయవలెను) ఓంకారము చేత దేవునికిని జీవునికిని ఎటువంటి సంబంధమున్నదో చెప్పబడినది. పెద్దలును వైకుంఠంలో నారాయణుని సేవించుచు, సుఖము ననుభవింప వలసిన యీదాసుడు, ఇతరులకు దాసుడు కావచ్చునా?" అని అన్నారు. జీవాత్మకు శ్రీమన్నారాయణు నొక్కనినే సేవింపవలె నన్న జ్ఞాన ముండవలెను.

అకారముద్వారా రక్షించు దేవుని గూర్చి, మకారముద్వారా రక్షింపబడు జీవునిగూర్చి చెప్పుకొనుచున్నాము. ఉకారము ద్వారా ఆ దేవునికొరకే ఈ జీవులు దాసులై యుండుట ఫలిత మనియు చెప్పుకొన్నాము. ఇప్పటికి ఓంకారార్థము పూర్తియైనది.

ఉకారములోని రహస్యార్థము నమః పదములోను, అకారములోని రహస్యార్థము నారాయణ పదములోను, మకారములోని రహస్యార్థము అయ అను ప్రత్యయములోను విపులముగా తెలియబడుచున్నవి. (కొందరు మకారములోని రహస్యార్థము 'నార' అనుపదము వివరముగా తెలుపుచున్న దందురు. నారము = జీవులు. నార + అయనుడు = నారాయణుడు = జీవులకు స్థానమైన వాడు).

నమః ముందుచెప్పి, నారాయణాయ తర్వాత చెప్పబడిన కారణ మేమిటి! నమః - నాకు నేను దాసుడను గాను. అని చెప్పుకొన్న తర్వాతనే నారాయణాయ - నారాయణుని కొరకే, అన్నట్లయితే, ఈ జీవుడు ఇతరులకేమిటి తనకుగూడ దాసుడుకాకుండ 'నీకు దాసుడు'

ననుచున్నాడే అని తలచి, నారాయణుడు కనికరించును. అందులకే మంత్రమందు, నారాయణ పదముకన్న ముందే, నమః పదముంచ బడినది,

"నమః" లో మః అని, న అనియు రెండక్షరము లున్నవి. మః- నాకు న (దాసుడను) కాను. నమః - నాకు నేను దాసుడను గాను. అన్ని విధాల గొప్పవాడు భగవంతుడు గావున, ఆతనికే యని చెప్పు కొనుట కవకాశ మున్నది. నాకే నేను దాసుడ ననగా తన శరీర పోషణము, తన యింటికృత్యము మాత్రమే చూచుకొనుట యగును. తనకు దానే దాసుడై యుండువానిని భగవంతుడు దయజూడడు' తనవైపు మళ్ళించుకొనడు. మోక్ష యోగ్యత వీనికి లేదనుకొని వద లును. అందుకని ముందు నమః ఉండుటే బాగు.

భగవంతుని బొందుటకు మూడు ఆటంకము లున్నవి. 1. స్వరూప విరోధి, 2. ఉపాయ విరోధి, 3. ప్రాప్య విరోధి, ఇవి : స్వరూపవిరోధి యనగా భగవంతుని దాసుడై యుండుటే తనస్వరూపమై యుండగా, భగవద్దాసుడ నని నమ్మియుండక, నేను నాది యని అహం కారపడుట. ఉపాయవిరోధి యనగా భగవంతుడే ఉపాయమై యుండగా కర్మ-జ్ఞాన-భక్తులే, ఉపాయము లని నమ్మియుండుట. ప్రాప్యవిరోధి యనగా, పొందదగిన మోక్షము నొందగోరక, యితర సుఖముల గోరుట. ఈ మూడు విరోధులును నశింపవలెను. అనగా,

'నేను నీవాడను, నాకున్నదియు నీదే' యని భగవంతుని నమ్మి యుండవలెను. ఏ కోరికయును లేక భగవంతుని దాస్యమునందే (- మోక్షమునందే) కోరిక గల్గియుండవలెను. ఈ విధముగా నమః అను శబ్దముచేత, మోక్షమున కాటంకమైన మూడు విరోధులను వదలు కోవలెనని చెప్పబడినది. తాను భగవద్దాస్యము చేయుగా, భగవంతుడు రక్షించు నుపాయమై, మోక్షఫలము (- ప్రాప్యము) నిచ్చునని భావము.

"తొండైవిల్లి మంగలమను పెరుమాళ్ళ గ్రామమునకు నమస్కారము" అను పెద్దలమాటవల్ల, జీవునికి భగవంతుని వస్తువుల విషయములో గూడ, సేవ చేయవలసి యున్నదని తెలియుచున్నది. ఇట్లు సేవ చేయుటయే ఆత్మ స్వరూపము. "వేంకటేశ్వరునకు నమస్కారము" అను పెద్దల శ్రీ సూక్తివలన భగవంతుడు రక్షించుట కుపాయము అని తెలియుచున్నది. "చివరకు చెప్పదగిన నమః పదము చెప్పు" మను శ్రీ సూక్తి వలన భగవత్కైంకర్యమే ఫలము, అని తెలియుచున్నది. "స్వామీ! నీదాసులకు సేవచేయుటయే నా కిష్టము" అను శ్రీ సూక్తి వలన భాగవతోత్తములకు గూడ సేవచేయవలె, నని తెలియుచున్నది. నమ శ్శబ్దములో నింత విపులార్థ మున్నది. కొందరీభాగవతోత్తములకు దాస్యము చేయుటను ( - భాగవత శేషత్వమును ) అకారము ద్వారా చెప్పుకోవలె నందురు. మరికొందరు ఉకారము ద్వారా చెప్పుకోవలె నందురు.

పై ఓంకారము వల్ల, 'భగవంతుడు స్వతంత్రుడు గావున, తన లాభమునే చూచుకొనుననీ; అచిత్తు (-జీవుని శరీర ప్రకృతి) చైతన్యము లేనిది గావున, ఇతరుల కుపయోగ పడుననీ, ఆత్మచైతన్యము గలది గావున, తనకు నితరులకు నుపయోగ పడుననియు తెలియుచున్నది.

ఇప్పుడు నమః (-నాకు నేను స్వతంత్రుడను గాను) అనుటవల్ల, భగవంతుడు నన్ను, ఇతరులకు మాత్రముపయోగించు అచిత్తువలెనే, తన యానందముకొరకే వినియోగించుకొను గాక, అని చెప్పినట్లయినది.

భగవంతుడు, తన యానందముకొరకు జీవునితో గలసిమెలసి యుండునప్పుడు ఆయన యిష్టము, చంక నెత్తుకొననిమ్ము, నెత్తి కెత్తుకొననిమ్ము; అప్పుడు "అయ్యో! నేను దాసుడనుగా నుండవలసిన వాడను గదా, నా దాస్యము చెడిపోవునేమో" యని అతని అంకె సంకెలలకు రాకుండ పోగూడదు ఈ ఆత్మ అతనిదానుడు. ఏమైనను చేసికొననిమ్ము ఆయన యిష్టము' అనుకోవలెను, ముద్దు వచ్చినప్పుడు చంక నెక్కినను

మనము చేయదలచిన పనిని చేసిన వారమగుదుము. బిగదీసికొని కూర్చుండిన ఆయన యానందమును జెడగొట్టిన వారమగుదుము; మన మును చెడుదుము, ఓంకారమువల్ల నయిననేమి, నారాయణపదము వల్లనయిననేమి. నారాయణునకే దాస్యము చేయవలయునని తెలియు చున్నది. కావున దాస్యము చేయుటయే ముఖ్యమనుకొనవలెను. పెరు మాళ్ళ యానందమున కభ్యంతరము గల్గింపరాదు.

ఈ విధముగా శ్రియఃపతిని సంతోషపెట్టుటకు ఆయన కిష్టమని చేయు యజ్ఞ యాగాలు, ప్రాయశ్చిత్తాలు, పాపములు పోగొట్టును. అన్ని లాభములు గలిగించును. భగవత్ప్రీత్యర్థముగా చేయని యజ్ఞ యాగాది సత్క్రియ లన్నియు వ్యర్థము.

నారాయణుడు = నశింపని వస్తువులకు స్థానమైనవాడు. నారము లనగా నశింపని వస్తువులు.

నారములు : జ్ఞానము, ఆనందము, అమలత్వము మొదలైనవి, వాత్సల్యము, సౌశీల్యము మొ॥ విగ్రహములు కాంతి సౌకుమార్యము మొ॥ వారి మంచి నగలు మంచి యాయుధములు లక్ష్మి మొదలగు అమ్మవార్లును, వైకుంఠములో నెప్పుడును పరమాత్మను సేవించు నిత్య సూరులును, గొడుగు చామరము మొ॥ వారి ద్వారపాలకులు సేనా పతులు మోక్షమొందిన వారు వైకుంఠము ప్రకృతి సంసారములో నుండు జీవులు కాలము మహాత్తు మొదలైన వికారములు, బ్రహ్మాం డములలో నుండు దేవతలు వస్తువులు ఉన్నింటికిని (అయనము =) స్థానమైన వాడు.

నార + అయనుడు = నారాయణుడు = 1. (పైన చెప్పబడిన) నారము లన్నింటికి నాధారమైనవాడు. 2. ఆ నారము లన్నింటికి అంతర్యామి యైనవాడు, అనియు నర్థము చెప్పవచ్చు. ఈ రెండు విధముల అర్థము చెప్పుకొనుటవల్ల, నారాయణునకు రెండుగుణము

ఉన్నవని తెలియుచున్నది. వీని యన్నింటికి నాధారమైన వాడనుట వల్ల గొప్పవాడనియు, వీని నాశ్రయించుకొని అంతర్యామిగా నున్నా డనుటవల్ల ప్రీతివానికి చాల సులువుగా నందుబాటులో నున్నాడనియు దెలియుచున్నది. మరియు అన్ని వస్తువులలో నిమిడి యున్నాడని, జీవాత్మల జేరదీసికొను ఉపాయమైన వాడని, ఈ జీవాత్మలు చేరవల సిన గమ్యస్థానము వాడే యనియును జెప్పకోవచ్చును.

"భగవంతుడు నా ఉపకారము చేయును, నా తండ్రి, నా చుట్టము, నారాజు" అని తిరుమంగై యాళ్వారు చెప్పినట్లు సర్వేశ్వ రుడే మన కన్నివిధాల బంధువు. మన మాఘన పనిలో నుండక ప్రాపం చిక మగు నితరమైన పనులలో నుండినను ఆయన మనను రక్షించు పని లోనే యుండును.

ఉదాహరణము : మన బంధువు ఒకడు అడిగితినక అభిమాన పడి భోజనము మానినా డనుకొందము. అది మనము తెలిసికొన్న తరు వాత చాటున నుండి సత్రములో నైన నింతయన్నము పెట్టు నేర్పాటు చేయుదుము. అట్లే భగవంతుడు, నీ దాసుడనని తెలియవంచక విర్రవీగి తిరుగుచున్న జీవుని, అంతరాత్మగా వానిలోనే యుండి యున్నాడు గావున, మంచిమార్గమునకు ద్రిప్పను. అట్టి దయామయుడగు నారా యణుని,

"ఆయ" (-కొరకు) అతనికొరకే సేవ చేయవలయును అను ప్రార్థన తెలుపబడుచున్నది. ఇదివరకు [నమః-] నాకు నేను రక్షించు కొనువాడ గాను, నాకు వాడే రక్షకుడు అనుటవల్ల బరువుభార మం తయు దేవునిమీాదనే పడవైచెను. నీకు దాస్యము చేయుదును చేయించు కొమ్ము అని దేవుని ప్రార్థించుట అవసరమా? అందురేమో వినుడు "నీకు పాదుకలుగానై చిగురుటాకువంటి నీ (శ్రీ)ముఖమును సేవించు చుందును" అని పెద్దలు చెప్పచున్నారు. భగవంతుని వాడై భగవం తుని సేవచేయుటకైనను ఆయన పాదుకలుగా నుపయోగపడవల

యును గదా! అందుకనే ప్రార్థించుట. అంతేకాని జీవుడు తన సొంత లాభమును గోరికాదు. మధ్య తెచ్చిపెట్టుకున్న ప్రార్థనయు గాదు. అట్లు సేవచేయుట ఆత్మయొక్క లక్షణమే. జీవు లందులకే పుట్టినారు. ప్రార్థించుట చాలా యవసరము. కావుననే 'ఆయ' ( - కొరకు ) అను చోట మన మెడ తెగక సదా దాస్యము చేయుచునే యుండవలయును అని పెద్దలు అర్థము చెప్పుదురు.

"కన్నులార సేవించి కాలము గడపు నాళగల వారికి నిద్ర వచ్చునా?" "నిత్యసూరులు సదా సేవించుచున్నారు" "సేవించుట కనుకూలమగు రోజులను వృధాగా గడపితిని" అను పెద్దల శ్రీసూక్తుల వల్ల భక్తులు జరిగిపోయిన కాలమందు జరుగుచున్న కాలమందు జరుగబోవు కాలమందును భగవత్సేవకొరకే తహతహ పడుచుందురని తెలియుచున్నది. సేవింపక ముందెప్పుడు సేవింతుమా అను తహ తహ వల్ల నిద్రపట్టదు. సేవించునపుడు సేవించి యానందించుటయే సరిపోవును. సేవించిన తర్వాత వృధాగా గడపిన రోజులకై దుఃఖించు చుండ సేవింపక యింకను నిద్రపోవుదురా? "అజ్ఞానినై యున్నప్పుడు నేను పుట్టినను పుట్టనట్లే, జ్ఞానము నెరిగిన తర్వాత సర్వేశ్వరు నెన్న డును మరచియుండ" లేదను శ్రీ సూక్తివల్ల మనము మనతోడి జీవు లును, ఈ జ్ఞానము లేనప్పుడు పుట్టనట్లే. జ్ఞానము గల్గినతర్వాత మరచి పోక భగవన్మంత్రమునందు భగవంతుని యందు నిష్ఠగలవాండ్రమై సేవ చేయుచుండ వలయునని గ్రహింపవలెను.

ఈ విధముగా సర్వదేశ-సర్వకాల సర్వావస్థలయందును భగ వంతుని కొరకే దాస్యము చేయుచుండవలె నని ఆయ ( - కొరకు ) తెలుపుచున్నది.

ఈ తిరుమంత్రము 8 దారములలో 8 పురులువేసిన మంగళ సూత్రము వంటిది. 8 దారములు 8 అక్షరములు, 8 పురులు 8 పద

ములు. లోకములో సమర్థుడైన రాజు మంగళసూత్రము కట్టి భార్యలను రక్షించుకొనును.

## ద్వయ మంత్రార్థము :

విష్ణుభక్తి కలవారందరును వైష్ణవులే - వైష్ణవుల కీలక్షణము లుండవలెను. ఈ లోకములో సుఖముగా గనిపించు ధనము భోజనము వస్తువులు వాహనాలు భార్యాపుత్రులు మొదలైనవానితో నున్న సంబంధమును వాసనతోసహా విడిచిపెట్టవలెను. (అనగా అన్నింటిని విడచి అందరనువిడచి అడవికి పోవలెనని అర్థముగాదు. సంసారములో నున్నను రేగడిబురదలోని కుమ్మరిపురుగువలె అంటీయంటక యుండవలెను. భగవంతుడే రక్షించువాడని ఆతనినే నమ్ముకొని యుండవలెను.

ఇట్లు నమ్మియుండియు మోక్షము కల్గినప్పుడు చూచుకొందములే యనుకొనక 'ఆ పెరుమాళ్ళ వైకుంఠము నెప్పుడు సేవించుకొందుమా' యని ఆతురత పడవలెను. బ్రతికి యున్నంతకాలము శ్రీరంగము తిరుపతి మొదలగు దివ్యదేశములను సేవించుచు, భగవత్కల్యాణ గుణముల దెల్పు తిరునామ సంకీర్తనలు చేయుచు, భగవదారాధనలతో గాలక్షేపము చేయుచుండవలెను. ఈ ప్రకారము చేయు భాగవతోత్తములు కనబడినపుడు "ఆహా! భాగవతోత్తములను సేవించుకో గలిగినా"నని యానందపడవలెను. మరచిపోయియైన నితర మంత్రముల జోలికిపోక తిరుమంత్ర - ద్వయమంత్రముల శ్రద్ధాభక్తులతో జపము చేసికొనుచుండవలెను. మంత్ర ముపదేశించిన యాచార్యుల యందెంతో భక్తిగలిగి యుండవలెను. ఇనుమును బంగారము చేసినట్లు మూర్ఖులైన తమను మూర్ఖత్వము బోగొట్టి భగవంతుని జేరు మార్గము జూపించిన ఆచార్యుల యుపకారమును మరచిపోరాదు. జ్ఞాన వైరాగ్య శాంతములు గలవారితో సావాసము చేయుచుండవలెను. ఇవే వైష్ణవాధికారుల కుండవలసిన లక్షణములు.

వైష్ణవు డనగా విష్ణుభక్తుడని యర్థమే కాని, వైష్ణవ వంశస్థుడే యని యర్థముగాదు. బ్రాహ్మణుడు కాని శూద్రుడు కాని పంచముడు కాని ఎవరైనను సరే, విష్ణుభక్తి కలవారందరును వైష్ణవులే. అన్ని కులాలవారికి అన్ని జాతులవారికి స్వదేశస్థులకు విదేశస్థులకు అందరికిని ఈ వైష్ణవము పుచ్చుకొనుట కధికార మున్నది. పై లక్షణము లున్నవాడే నిజమైన వైష్ణవుడు. అవి లేని వైష్ణవ కులస్థుడును నిజమగు వైష్ణవుడు కాడు.

అట్టి లక్షణములున్న వైష్ణవాధికారి తిరుమంత్రము-ద్వయమంత్రము-చరమశ్లోకమును అర్థముతోసహా తెలిసికొని, జపించుచు, తదనుకూలముగా ననుష్ఠింపవలెను. ఈ మూడు మంత్రములు కాక తక్కిన శాస్త్రమంతయు, జీవుల వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి, దేహము ద్వారానే మోక్షమును సంపాదింపవలెనని తెలుపుచున్నది.

తిరుమంత్ర మేమి తెలుపుచున్నది ?

"మోక్షమునిచ్చు బరువుభారము భగవంతుని మీదనే పెట్టి, ఆత్మ తనను రక్షించుకొను ప్రయత్నము విడుచుకోవలెను-ఈలాగున విడుచుకోవలసినది ఆత్మయే కావున, ఆత్మద్వారానే మోక్షము సంపాదింపవలెనని తిరుమంత్రము తెలుపుచున్నది' చరమశ్లోక మేమి తెలుపుచున్నది? "భగవంతు డేమిచేసినను చేయగల స్వతంత్రుడు. జీవుని యంగీకారముతో బనిలేదు. భగవంతుడే స్వతంత్రించి మోక్షమొందుట కడ్డముగా నున్న పాపము లన్నింటిని బోగొట్టి, తనదగ్గరకు దీసికొనును, కావున భగవంతుని ద్వారానే మోక్షము పొందవలె"నని శ్లోకము తెలుపుచున్నది. ద్వయమంత్ర మేమని తెలుపుచున్నది? దీనిలో లక్ష్మీనారాయణుల పేర్లున్నవి. ఆ జగన్మాత నారాయణునితో జెప్పి మోక్ష మిప్పించును గావున, లక్ష్మి ద్వారానే మోక్షము లభించు"నని ద్వయమంత్రము తెలుపుచున్నది.

"నాకే యుపాయమును తోచుటలేదు. నన్నితరు డెవ్వడును రక్షించువాడు లేడు." అనుకొనువాడైన జాలున్, ఈ ద్వయమంత్ర ముపదేశము పొందుటకు దగినవాడే యగును. లక్ష్మి, నారాయణు నితో జెప్పి పురుషకారము = RECAMEND చేసి రక్షించును. ప్రిపన్న పరిత్రాణ మను గ్రంథములో ఈ విషయము చక్కగా దెలుప బడినది. వైకుంఠములో శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవికి మొదట నీ ద్వయమంత్రము నుపదేశించెను.

ఈ మంత్రములోని మొదటి భాగములో "లక్ష్మి తల్లిని ముం దుంచుకొని నారాయణుని పాదములే గతియని భావించుచు బడి యున్నాను" అను అర్థమున్నది. రెండవ భాగములో "లక్ష్మినారా యణు లిరువురును గలసియున్నప్పుడు దాస్యము చేయుచున్నాను" అను అర్థమున్నది.

శ్రీ అనగా లక్ష్మి. శ్రీకి రెండు వ్యుత్పత్త్యర్థము లున్నవి. 1. జీవు లచే సేవింపబడుచున్నది. 2. భగవంతు నాశ్రయించునది. అనగా జీవులు లక్ష్మికి దాస్యముచేయు దాసులు, లక్ష్మి నారాయణునకు దాస్యముచేయు దాసి అన్నమాట. ఈ తల్లి, మన తండ్రియగు నారా యణునకు, జీవులమగు మనకు మధ్యనుండి తన దాస్యముచేత నారా యణుని సంతోషపెట్టి, మన విషయముచెప్పి యాతనిచే రక్షింపజేయును. చల్లని మనస్సు గల నారాయణుడు జీవుల తప్పుడు పనులకు గోపించి, నీళ్ళలో బడ్డ నిప్పువలె కస్సుబుస్సులాడు నప్పుడు లక్ష్మి సర్దిచెప్పి కోపము చల్లార్చును. ఈమె జీవులకు తల్లి, నారాయణున కానందము గల్గించు ప్రియురాలు, కాబట్టి తన బిడ్డలమైన మనసుగూర్చి చెప్పి, రక్షింపజేయ దలచుకొన్నచో నీమె మాట కడ్డమున్నదా?

సీతాదేవిని రాక్షసాంగనలు పదినెలలు నిష్టము వచ్చినట్లు వేపు కొని తిన్నారు. అప్పుడు హనుమంతుడు వారి తప్పులను లెక్కబెట్టి

చిత్రవధ చేయవలె ననుకొన్నాడు. కాని, సీతమ్మ "ఎందుకు కోపింతువు హనుమన్నా! వీరు రావణుని దాసీలు. అతడు చెప్పినట్లు చేయుదురు. అయినను తప్పుచేయని దెవరు? అని మంచి మాటలతో సమాధానము చెప్పినది. హనుమంతుడు కిక్కురుమన లేదు. ఇక ప్రియురాలైన లక్ష్మి తాను చెప్పినట్లు నడచుకొను నారాయణుని సమాధానము పెట్టలేదా? చెప్పి మనలను ఉప్పుక రక్షింపజేయును. అటువంటి లక్ష్మితో,

మత్ (= కూడియున్న) దీనివల్ల లక్ష్మినారాయణు లిద్దరు నెప్పుడును గలిసియుందురని దెలియుచున్నది. ఈమెతో గలసియుండుటచేతనే పరమాత్మయను వస్తువుండుట సంభవించును. లక్ష్మి యెప్పుడును నారాయణునితో గలసియే యుండును. ఎందువల్లననగా, భగవంతుడు శిక్షించుటకు రక్షించుటకును స్వతంత్రుడు. జీవు లెప్పుడును ఏవో తప్పులు చేయుచునే యుందురు. సదా వీరి రక్షణ చెప్పి చేయించుట యవసరము. తాను లేకున్న నారాయణుడు ఈ జీవుల నొక్కొక్క తప్పును లెక్కపెట్టి శిక్షించును. కావున పురుషకారము చేసి జీవుల రక్షించుటకోసమే ఆమె నారాయణు నెడబాయకుండును. ఈ కిటుకు నెరిగిన జీవు లెప్పుడును భయపడరు. లక్ష్మి నారాయణు లిరువురును జేరియున్నప్పుడే ఆశ్రయింపవలె నను అభిరుచి యుండవలెను గాని, ఏసమయములో నతని గొల్చినను మంచిదే. సీతమ్మ దగ్గర నుండుటచేతనే కాకాసురుడు రక్షింపబడెను. ఈమె దగ్గర లేకుండుటచేతనే రామునిచే రావణుడు చంపబడెను. ఇంతకును లక్ష్మి నారాయణుని దగ్గర నెల్లప్పు డుండుట భక్తులకు జాల యవసరము. కావుననే, (శ్రీ)మత్ = లక్ష్మితో గూడుకొన్న అను పదము మంత్రమునం దుంచబడినది.

నారాయణ = లక్ష్మి రక్షించుమని చెప్పుటచేత దన కోపము నాపుకొని జీవుని రక్షించు విషయములో మంచి గుణములు చూపువాడు నారాయణుడు. ఈలాగున జూపు కల్యాణగుణములను దెల్పు పదము

నారాయణుడు, ఈలాగున జూపు కల్యాణగుణములను దెల్పు పదము 'నారాయణ' అనునది.

ఆ కల్యాణగుణములు 6. 1. వాత్సల్యము, 2 స్వామిత్వము, 3. సౌశీల్యము, 4. సౌలభ్యము, 5. జ్ఞానము, 6. శక్తి. వీని అర్థము తెలిసికొందము. 1. వాత్సల్యమనగా గోవు తన దూడను తన కడుపు కండగదా యని దాని మకిల పోవునట్లు నాకి, ఒడలు సరిచేసి పాలిచ్చి కాపాడును, తన బిడ్డజోలికి వచ్చినవారిని పొడిచి తన్ని రక్షించుకొను నట్లే, నారాయణుడు మన తప్పుల నొప్పులుగా భావించి రక్షించుట. ఇదే వాత్సల్యము. 2. స్వామిత్వమనగా, ఆత్మ లన్నింటికి ప్రభువును గదా యని వారి కిష్టము లేకున్నను, తన కన్నివిధముల దాస్యము చేయించుకొనుచు రక్షించుట, ఇదే స్వామిత్వము. 3. సౌశీల్యమనగా 'భగవంతు డన్ని లోకాలకు ప్రభువు. నేను చాల తక్కువవాడను. వాడెక్కడ నేనెక్కడ?' అని జీవుడు భేదము తలపకుండునట్లు వర్తించుచు, తనకే లాభమనుకొని భగవంతు డాజీవులతో గలసిమెలసి యుండుట. ఇదే సౌశీల్యము. 4. సౌలభ్యమనగా, కంటికి గనబడని భగవంతుడు అవతార రూపముగా, దేవాలయాలలో విగ్రహరూపము గాను గనబడుచు రక్షించుట. ఇది మనకు సులభము. కావున ఇదే సౌలభ్యము. 5. జ్ఞానము అనగా ఈ జీవుని పాపము బోగొట్టి ఏవిధముగా బుణ్యమీయవలెనో, మరియు గష్టముల బోగొట్టి యే విధముగా సుఖముల నీయవలెనో నిర్ణయించు తెలివి, లోకులకు జ్ఞానమిచ్చి తనను దెలిసికొను మార్గమునుగూడ దెల్పి, రక్షించు తెలివి. ఇదే జ్ఞానము 6. శక్తియనగా, నీచులైన సంసారులను నిత్యసూరులతోబాటు ఒక్క పంక్తి నుండదగిన వారినిగా జేయుటలో నగు అఘటన ఘటనా సామర్థ్యము, ఇదే శక్తి.

ఈ 6 కల్యాణగుణములను నారాయణునియందు జక్కగా నిండి యున్నట్లు మనము చూడగల్గు చున్నాము.

ఏవి? ఎక్కడ? మీ మాలయములో భగవంతు ననేక పర్యాయములు సేవించుకొన్నాము కాని, మాకేమియు గనబడలేదే? అందు లేమో చూడుడు. అన్నియు నున్నవి. ఆ భగవాను నొకసారి మీ మనస్సులలో జూచుకొనుడు! అవిగో చేతులలో బట్టుకొని యున్నాడు శంఖచక్రములను, ఇత రాయుధములను. అవి జ్ఞానమును శక్తిని దెలియ జేయునని కావా? ఆ ఆయుధాలు మన విరోధులను శిక్షించి మనల రక్షించుటకే. అదిగో అభయహస్తము నా బిడ్డలారా! మిమ్ము రక్షింతును అన్నట్లు పట్టుకొన్నాడు. అది వాత్సల్యమును దెలుపుట లేదా! అదిగో వజ్రాల కిరీటము పెట్టుకొన్నాడు, రాజు(= స్వామి మాదిరిగా) స్వామిత్వ మనగా నిదేకదా!

అదిగో నారాయణుని తిరుముఖ మండలము చూడుడు, ఎట్లు చిర్నగవు తొణికిసలాడుచున్నదో; ఇంతకన్న సౌశీల్య మేవిధముగా నుండును?

మనతో గలసిమెలసి మాట్లాడుచున్నట్లున్నదా శ్రీముఖము ఇదిగో యిక్కడనే మనముందు విగ్రహరూపములో దర్శన మిచ్చుచున్నాడు పరమాత్మ. కనబడ నవసరములేని భగవంతుడు మనకు సౌకర్యము సౌలభ్యము గలిగించుటకు గాకున్న మరెందు కాలయములోనే వేంచేసియున్నాడు? ఇంత సులభుడుగా నుండి మనల రక్షించుచున్నాడు.

ఆ యాయుధములను కీరటమును జూచినారుగదా మనను రక్షించు నని నమ్మకము కలిగినదా! ఆ యభయహస్తము ఆ తిరుముఖ మండలము, ఆ చిరునవ్వు ఆ శ్రీపాదములు చూచినారుకదా "ఆహా! ఎంత భోగ్యముగా నున్నవి! భగవ ద్విగ్రహము చూచుచున్నప్పుడు రక్షించునను నమ్మకమును, తనివితీరని యానందమును గల్గుచున్నవి గదా, అటువంటి నారాయణుని యొక్క,

"చరణౌ" = రెండు పాదములను ఈ శ్రీపాదములు రెండు నొకచోట జేర్చి యుంచుటవల్ల నెంతో సౌందర్యముగా నున్నవి. రెండని చెప్పుట చేత ఈతని రెండుపాదములు తప్ప, మనము తరించు టకు నితరోపాయ మేదియు లేదని చెప్పినట్లయినది. భక్తులను లక్ష్మి నారాయణులు ఒకవేళ విడిచిపెట్టినను శ్రీపాదములు విడువక తప్పక రక్షించును.

చంటిబిడ్డ తల్లి చేతులనుగాని కాళ్ళనుగాని నోటిలో బెట్టుకొనక, తన కిష్టమైన స్తనములనే నోట బెట్టుకొనును. అలాగే దాసుడు శ్రియఃపతి దాస్యమును చేయుట కనుకూలమైన శ్రీపాదములనే పట్టు కొనును. ఈ పాదములద్వారా నారాయణుని దివ్యమంగళ విగ్రహ మును గూడ మనము ధ్యానింపవలెను. ఆ దివ్యమంగళ విగ్రహము లక్ష్మితోగూడి యున్నది. ఇందాక చెప్పిన వాత్సల్య-స్వామిత్వములు మొదలైన సకల కల్యాణగుణములు గలది. గిట్టక అనరాని మాటలన్న శిశుపాలుని గూడ ఈ భగవద్విగ్రహము తనలోనికి జేర్చుకొన్నది.

అంతమంచిది. కావున కేవలపాతములనే కాక పాదముల ద్వారా వాని దివ్యమంగళ విగ్రహములను గూడ ధ్యానింపవలెను. అట్టి పాదములను,

"శరణం" – రక్షకముగా; అనగా 'అనిష్టములను బోగొట్టు కొనుటకు, ఇష్టమైన వానిని జేకూర్చుకొనుటకు మంచి యుపాయము' అన్నమాట.

జీవులందరకు ఉపేయము - పొందదగిన వస్తువును ఆ శ్రీపాద ముల జంటయే అట్లు మోక్షము బొందుట కుపాయమును ఆ శ్రీపాద ముల జంటయే.

పురుషకారము (- చెప్పిరక్షింప) జేయు లక్ష్మితో, జీవులను రక్షించు కల్యాణగుణములతోడను కనులపండువుగా, సేవింపదగు దివ్య

మంగళ విగ్రహముతోడను గూడియున్న నారాయణుడే ప్రాప్యము. కావున అట్టి భగవంతుని బొందుటకు వేరుదిక్కు లేనివారు గావున భగవంతుని శ్రీపాదములే దిక్కని నమ్మి, వానినే ఉపాయముగా, స్వీకరించుటయే ముముక్షువుల కర్తవ్యము. శరణాగతి యనునది ఉపాయముగాను భక్తులు తలంచుచుండవలెను. "చరణములే గతి" యని మంత్రములో నుండుటవల్ల, నింతకన్న వేరుగతి (-ఉపాయము) లేదని తెలియుచున్నది. దేనికి ఉపాయము? అటువంటి భగవంతుని బొందుటకు ఆతని శ్రీపాదములే నాకుగతి యని,

"ప్రపద్యే - పొందుచున్నాను, పట్టుకొనుచున్నాను. ఈ విధముగా నాశ్రయించుట 3 విధములుగా నుండవచ్చును. 1. 'నన్ను రక్షింపుమా' అని మాటల రూపముగా, 2. రెండు చేతులను జోడించి నమస్కారము చేయుట, అనగా శరీర రూపముగా, 3. జ్ఞానముగల్గి "శ్రీపాదములే రక్షించు" నని మనస్సులో తలంచుట; అనగా మానసికముగాను ఉండును. ఎట్లాశ్రయించినను ఫలముగల్గును గాని 'జ్ఞానము' వలననే మోక్షము కలుగునని శాస్త్ర ముండుటచేత, మానసికముగ నాశ్రయించుటే ఉత్తమము.

మోక్షము గల్గించుటకు నిజమైన యుపాయము సర్వేశ్వరుడే. మన వాక్కు శరీరము మనస్సును గావు. ఇవి అసలు ఉపాయమగు సర్వేశ్వరుని బట్టుకొను చిన్న యుపాయముల వంటివి. ఇట్లు మూడు విధాల నాశ్రయింపవలెనను నిర్బంధ మేమియు లేదు. కాని, ఆశ్రయించుట మంచిదే.

ఒక్కసారి ఈ శ్రీపాదముల నాశ్రయించినవాడు, మరల మరల నెట్లాశ్రయించుట సంభవించును? ఒక్కసారే, సమాశ్రయణ సమయములోనే "శ్రీమన్నారాయణుని శ్రీపాదములే నాకు గతి" అని నమ్మి పడియుంటిమి గదా. యావజ్జీవమును (ప్రపద్యే - ప్రపద్యే-) ఆశ్రయించుచున్నాను, ఆశ్రయించు చున్నాను అని అప్పటికప్పుడే

యాశ్రయించుచునే యుండుచున్నట్లు వర్తమాన కాలములోనే చెప్పుకొనుటెందులకు?

మన స్వభావము నిలుకడగా నిలిచియుండదు – చేయరాని పనులమీదికి బోవుచుండును. ఆలోచింపగూడని విషయముల నాలోచించుచుండును. ఒక్కొక్కప్పుడు మంచిగుణము గల్గి పశ్చాత్తాప పడి భయపడినప్పుడు ప్రాయశ్చిత్తముగా మరల మరల ఆ వెనుకటి ఆశ్రయింపునే ఈ మంత్రము ద్వారా జ్ఞాపకము చేసుకొనవచ్చును. అందులకే ఈ ద్వయమంత్రములో ప్రపద్యే (– ఆశ్రయించుచున్నాను) అని వర్తమానకాలములోనే చెప్పబడినది.

మరియు భగవంతుని బోధించునవే యనుకొని ఇతరోపాయముల మీదికి ధ్యాసపోకుండ నుండుటకును, వేరొక విధముగా ప్రొద్దు పుచ్చుకో గూడదు కావునను, భగవత్కల్యాణ గుణములు తలంచిన కొద్దియూ భోగ్యముగా నుండును గావునను, శ్రీమన్నారాయణుని చరణములనే యాశ్రయించు చున్నాను అని [–ప్రపద్యే అను క్రియ] వర్తమాన కాలములోనే యుండుచున్నది. అంతేకాని మోక్షము త్వరగా సూటిగా కలుగునని యే మాటిమాటి కనుసంధించుకొనుటకు గాదు. మోక్షము త్వరగా గల్గించు అసలు ఉపాయము భగవంతుడే. జీవుని ఆశ్రయింపే కాదు. ఈ ఆశ్రయించుట ముఖ్యోపాయమగు భగవంతుని బట్టుకొను చిన్ని యుపాయము. మోక్షమునకై తొందరపడి ఈ చిన్ని యుపాయమును అసలు ఉపాయమని నమ్ముకొనుటవల్ల అసలు ఉపాయమగు భగవంతుని చిన్నబుచ్చినట్లగును అసలు ఉపాయము దొరకకపోవును.

హనుమంతుడు ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమునకు గట్టువడెను. కాని దానిని నమ్మక అనుమానించి రాక్షసులు త్రాళ్ళతో నా హనుమంతుని గట్టిరి. అందువల్ల బ్రహ్మాస్త్రము నవమానించినట్లయినది. బ్రహ్మాస్త్రపు పటు వదలిపోయినది. హనుమంతుడు తాళ్ళను పుటపుట త్రెంచుకొని

పోయి ఆ రైక్వుని గలిసికొని, తన యైశ్వర్యమును దీసికొని తన కాత్మ తత్వమును బోధించు మని ప్రార్థించెను. రైక్వుడు "ఆత్మతత్వము గొనుటకు దొరకెడి వస్తువు కా" దని చెప్పి, రాజును వెనుకకు బంపించెను. మరొకసారి రాజు నిరాడంబరముగా తన కుమార్తెను దీసికొని వచ్చెను. ఆమెను పరిగ్రహింపు మని నిగర్వియై ప్రార్థించెను. రైక్వు డాకన్య ముఖమును జూచి, జానశ్రుతి నిరాడంబరతను జూచి, అతనిని గనికరించెను. రైక్వుడు జానశ్రుతితో

"వాయు ర్వావ సంవర్గో, యదావా అగ్ని
రుద్వాయతి వాయు మేవా ప్యేతి ।
యదా సూర్యోస్త మేతి వాయుమే వాప్యేతి,
యదా చంద్రోస్త మేతి వాయుమేవా
ప్యేతి, య దావ ఉచ్ఛుష్యంతి
వాయు మే వాపియంతి, వాయుర్హ్యే వై
తాం త్సర్వాం త్సంవృంక్త ఇ, ఇత్యధిదైవతం"

వాయువే సంవర్గము. (సంవర్గమనగా సంగ్రహించి తనలోనికి చేర్చుకొనునది) అగ్ని ఆరిపోయి వాయువునందే చేరియుండును. ఇట్లే సూర్యుడస్తమించి, చంద్రుడస్తమించి, జలము ఇంకిపోయి వాయువునందే చేరిపోవును. ఆ వాయుదేవతయే అన్నిభూతములను సంగ్రహించి తనలో చేర్చుకొనును. తానే శేషించి యుండును, కావున వాయువే సంవర్గస్వరూపమై యున్నది. ఇది అధిదైవత దృష్టితో జెప్పబడినది.

మరి। "అథాధ్యాత్మం, ప్రాణోవావ సంవర్గః,
స యదా స్వపితి ప్రాణమేవ వాగప్యేతి,
ప్రాణం చక్షుః ప్రాణగ్ం శ్రోత్రం ప్రాణం
మనః ప్రాణో హ్యేవైతా న్సర్వాం త్సంవృంక్తే
ఇతి, తౌ వా ఏతే ద్వౌ సంవర్గౌ వాయు
రేవ దేవేషు ప్రాణః ప్రాణేషు"

గూడ సేవ చేయువలసి యుండునని వాచ్యముగా జెప్పినట్లు కాలేదు 'శ్రీమతే నారాయణాయ' అని దీనిలో నుండుటచేత "లక్ష్మితో గూడి యున్న నారాయణునకు దాసోహం అని తలచుచున్నాను" అని స్పష్ట ముగా జెప్పబడి యున్నది. తిరుమంత్రములో స్పష్టముగా గనబడని లక్ష్మిపదము ద్వయమంత్రములో స్పష్టముగా గనబడుచున్నది.

లక్ష్మణస్వామి సీతారాములిరువురును గూడియున్నప్పుడే, కోరి, సేవ చేసియున్నాడు. అలాగే లక్ష్మీనారాయణులు చేరియున్న ప్పుడే సేవచేయుట ఈ జీవుని లక్షణమునకు దగినట్లుండును.

ఒకవేళ నారాయణుడు జీవునిసేవ నొల్లకపోయినచో, లక్ష్మి పురుషకారము చేయునదిగావున, నచ్చజెప్పి జీవుని సేవ నందుకొను నట్లు చేయును. తలిదండ్రు లిరువురకు సేవచేయు కుమారునకువలె, జీవునకు భోగ్యముగా నుండును. ఒకరిని విడచి మరొకరికి సేవచేయ దగునా? తగదు. వారికిమాత్రము విడిగా సేవ చేయించుకొనుట యిష్టమా? కాదు. కావున నిరువురకును అర్థము వచ్చునట్లు నారాయణ శబ్దమునకు 'శ్రీమతే' అను విశేషణ ముంచినారు.

"నారాయణ" అనగా జీవులందరి దాస్యమును అంగీకరించు వాడు అని అర్థము. ఈయనయందు మనను రక్షించు వాత్సల్యాది కల్యాణగుణము లుండుటచేతను, రక్షింతునని చూపు అభయహస్తము, చిరునవ్వు ముఖము మొదలైన అవయవాలు ఈయన దివ్యమంగళ విగ్రహమునం దుండుట చేతను, దాస్యము చేయుచున్నాము. ఇష్టమైన వస్తువునకు సేవచేయుట మరియు నిష్టమేకదా! ఇట్లు కల్యాణ గుణము గల్గి జీవుల దాస్య మంగీకరించు నారాయణుని,

+ ఆయ = కొరకు. దీనిచేత సూటిగా 'లక్ష్మితో గూడిన నారా యణునికొరకు సేవచేయుటయే నీకు ఫలము' అని చెప్పబడుచున్నది.

సేవ ( - కైంకర్యము) అనగా నేమి పని?

1. నోటితో మంత్రమును పలుకుట.

2. చేతులతో నారాయణునకు నమస్కరించుట.

3. మనస్సుతో ఆ నారాయణుని పాదములే నన్ను రక్షించు పని నమ్మి యుండుటయును.

కైంకర్యము చేయించుకొన వలసిన సర్వేశ్వరునకు ముఖోల్లాసము ( - సంతోషము) గల్గించుటకై నిత్యము పైరీతిగా వాక్కుచేత శరీరముచేత మనస్సుచేతను ప్రార్థనను దెల్పుచుండవలెను. మన మాయనకు సేవకులమై యుండుటచేత, ఆయనద్వారానే తరింపవలసి యుండుట చేత, పొందవలసిన వస్తువు నాయనయే యగుటచేతను ఇట్లు త్రికరణ శుద్ధిగానే సేవ చేయవలసి యున్నది.

నమః - అనగా నాకు నీవే రక్షకుడవు అన్నమాట. భగవంతుని సంతోష పెట్టునదిగావున ఈ సేవచేయుట మన విధియని చేయవలయునే కాని "నేను భగవత్సౌందర్యమును జూచి ఆనందించుచున్నాను. ఆనందించు కర్తను నేను. నా కతడు ఆనందము గల్గించు వస్తువు" అనుకొనుటలో గూడ నహంభావ మున్నది. కావున దోషమే. ఈ దోషమును నమః పదము (నాకు నీవే రక్షకుడవను నర్థము గలది కావున) పోగొట్టును.

"ఓ భగవంతుడా! నీ సంతోషమునకే మేము దాస్యము చేయవలయు" ననెడి పెద్దల శ్రీసూక్తి ప్రకారము అహంభావమును విడచి భగవంతుని ముఖోల్లాసము కొరకే మనము కైంకర్యము చేయవలసి యున్నది.

భగవంతుని సౌందర్యమును జూచుచు నానంద పడుచున్నప్పుడు సేవ కాటంకము కల్గినను దోషమే. భగవత్సౌందర్యము చూచి యానందపడుటలో, మైమరచిన ఆకాసేపును సేవించు టాగిపోవును.

ఆనందము తనకు గల్గుటయేనా ముఖ్యము! ఆయన ముఖోల్లాసమునకై సేవచేయు దాసుడు, తన తెన్నయానందముగూడ ఆసేవ కడ్డమేనేమో యనుకొనును. ఏవిధమైన యాటంకము లేకుండ సేవచేసి, ఈ లోకములోనేమి, పరమపదము నందేమి, ఎల్లప్పుడు నీ సేవనే చేయించుకొనుమయ్యా! అనునంతటి అర్థము నమః పదములో నున్నది. ఈ లోకములో సరేకాని, పరమపదములో గూడ నేను నాది అను "అహంకార మమకారములు" నశించిపోక యుండునా? ఐనా, ఉండు నని యీ క్రింది పెద్దల వాక్యమును బట్టి తెలియుచున్నది.

"నిన్ను భోగ్యముగా సేవించి యానందించునప్పుడు, మే మనుభవించుచున్నా మనుకొను మా యహంకారమును బోగొట్టుము. నీ సేవ చేయుటయే నా స్వరూపము. కనుక ఆనందమువల్ల గలుగు పొంగును గల్గింపబోకుము!" అని నిత్యసూరులు ప్రార్థించిన ట్లొక చోట జెప్పబడి యున్నది. ఇంతకు "సర్వకాల సర్వావస్థలయందును భగవద్దాస్యము చేయుటయే మనవిధి. కలుగవలసిన లాభమో, మోక్షమో అంతయును ఆ సేవలోనే యున్నది." అని నమః పదము తెలుపుచున్నది.

## చరమ శ్లోకార్థము :

శ్రీకృష్ణు డర్జునునకు భగవద్గీతలో మొదట మోక్షము నొందుటకుగాను కర్మము జ్ఞానము మొదలైన కొన్నిటిని ఉపాయములుగా నుపదేశించెను. అర్జునుడు అవి చేయుట కష్టమని, తనచేతకాదని, భగవంతుని దాసుడుగా నుండుటయే జీవుని పనియై యుండగా, దీనికి అవి విరుద్ధముగా నున్నవనియు తలచి, దుఃఖించెను. తర్వాత కృష్ణుడు వాని దుఃఖమును బోగొట్టుటకై చివరి యుపాయముగా ఈ శ్లోకమును జెప్పెను, కావుననే యీ శ్లోకమునకు చరమ శ్లోకమను పేరు వచ్చినది. చరమ శ్లోకము – భగవంతుని బొందుటకు చివరి యుపాయముగా జెప్పబడిన శ్లోకము.

దీనిలోని మొదటి భాగములో, ఈ మంత్రమునకు దగిన అధికారి యేమిచేయవలెనో చెప్పబడినది. రెండవభాగములో జీవుని మోక్షము నొందించుటకు నుపాయమైన భగవంతుడు ఏమిచేయునో తెలుపబడినది.

కర్మ జ్ఞాన భక్తులు నిజమయిన మోక్షోపాయములు కానేరవు. అసలు మోక్షోపాయము భగవంతుడే. ఆ అసలు ఉపాయమును బట్టుకొనుటకు కర్మజ్ఞానాదులు చిన్న యుపాయముల వంటివి. ఈ మంత్రమునకు దగిన అధికారి చేయవలసినపని కర్మ జ్ఞాన భక్తులు, నిజమైన మోక్షోపాయములు గావనియు, నిజమైన మోక్షోపాయము భగవంతుడే యనియు, నమ్మియుండుటే. ఔను ఉపదేశ మొందువాడు పితప ఉపాయములగు కర్మజ్ఞానాదుల విడచి, అసలు ఉపాయమును బట్టుకొన నెంచినప్పుడు, మంత్రములో గూడ అసలు ఉపాయము భగవంతుడే యనియు, మిగిలినవానిని ఉపాయములుగా గ్రహింపవలదనియు గట్టిగా జెప్పబడియున్నచో, త్వరగా నిష్టపడి ఆ యుపాయమును బట్టుకొనుటకు తలయొగ్గును. అందులకే మంత్రములో సాధకునకు అసలు ఉపాయము భగవంతుడే" యని చెప్పబడుచున్నది.

ఈ చరమశ్లోక ప్రథమ భాగములో ఆరు పదములున్నవి. సర్వధర్మాన్-పరిత్యజ్య-మాం-ఏకం-శరణం-వ్రజ. ఇవి.

సర్వధర్మాన్ - అన్ని ధర్మములను, ధర్మమనగా ఫలమును గల్గించుట కుపాయమైనది. ఇచట ఏ ఫలము గల్గించుట కుపాయములని మాత్రమే అర్థము చెప్పవలెనుగాని సంతానము, పశుసంపద, ఐశ్వర్యము అను ఫలములు గల్గించునవి అని యర్థము చెప్పగూడదు.

కొన్నాళ్ళకైనను చెడిపోవునవే కావున, స్వర్గాది ఫలము లిచ్చునవనియును జెప్పగూడదు. వేదాలలో స్మృతులలోను చాల ధర్మాలు చెప్పబడినవి. కావుననే శ్రీకృష్ణుడు ధర్మాన్ - ధర్మములను అని బహువచనములోనే చెప్పెను. అవేవనగా, కర్మయోగము - జ్ఞాన

యోగము-భక్తియోగము-అవతార రహస్యము దెల్సికొనుట-భగవన్నామ సంకీర్తనము-భగవంతుని ముందు తిరువళికలు వెలిగించుట-తోమాలలు సమర్పించుట. ఇవన్నియు మోక్షమున కుపాయములను తలంపులో జేయబడుచున్నవి.

'సర్వ' (-అన్ని) అను పదమువల్ల ఈ పనులు చేయుట కవసరమైన సంధ్యావందనము, పంచ మహాయజ్ఞాలు మున్నగు నిత్య కర్మలు గూడ పై ధర్మములలోనే చేరును. ఇంతకు, అర్జునుని అభిప్రాయ ప్రకారముగా, పై వన్నియు ధర్మములు. అసలు ధర్మము భగవంతుడే. ఆ ధర్మాలన్నియు అసలు ధర్మాన్ని పట్టుకొను ఉపాయముల వంటివే. కావుననే,

పరిత్యజ్య – విడచి, ఆ సర్వధర్మములను మోక్షోపాయములనుకొందువేమో, కావు. ముత్యపుచిప్పను జూచి వెండియని భ్రమపడునట్లు, ఈ ధర్మాలే యుపాయములని పొరబడకుడు. అసలు మార్గమొకవైపుననుండగా మరొకమార్గమున బోయిన గమ్యము చేరనట్లే ఉపాయములు కానివాని నుపాయము లనుకొని ప్రయత్నించినను లాభమొందజాలదు.

'పరి అని' 'త్యజ్య'కు తగిలియుండుటచేత "పాపముల నేవిధముగా వాసనతోసహా విడువవలెనో యట్లే. మొగమాటము లేకుండ ఆ ధర్మాలను ( – ఉపాయములను ) వాసనకూడ లేకుండ విడువవలెను" అను అర్థము వచ్చును, భగవంతుని శరణు బొందకముందే అన్ని ధర్మములను విడచి అని చెప్పుటచేత, స్నానము చేయకముందే అన్నము తినరానట్లు ఇతరోపాయముల విడచుకొనకుండ అసలు ఉపాయమైన భగవంతుని శరణుబొంద వీలులేదు." అని తెలిసికోవలెను. ఇతరోపాయముల విడువక 'నీవే నాకు దిక్కు, ఉపాయము' అని నమ్మియుండుట ( – ప్రపత్తి చేయుట) తగదు. యుద్ధములో రావణాసురుడు విరిగిన విల్లును పట్టుకొని పారిపోవు చున్నంత వరకు

శ్రీరాముడు బాణములతో గొట్టుచునే యుండెనట. ఎప్పుడు ఇక నెదురు తిరుగజాలనని భయపడి విరిగిన విల్లును గూడ బారవేసెనో, (ఇతరోపాయముల విడచెనో) అప్పుడే రాముడు బాణములు వేయుమానెనట. కాబట్టి యితరోపాయములతో బ్రాకులాడు చున్నంతసేవును భగవంతుడు రక్షింపడు.

దశరథుడు సత్యమునకై ప్రాకులాడెను. సత్యమే యిచట నితరోపాయము. ఆ దశరథుడు రామస్వామిని అడవులకు విడచు కొన్నాడు. రాముడు దేవుడుకదా, సత్యమును ధర్మమును విడచి రాముడే నాకు నుపాయమని నమ్మియున్నట్లయితే, ఆ దశరథుడు మోక్షము నొందెడివాడే. అతడు సామాన్యోపాయమును బట్టుకొని దేవులాడెను గావున స్వర్గమును మాత్రమే పొందగలిగెను. మోక్షము నకు జెడెను.

అన్ని ధర్మములను విడచి అనగా అధర్మముల జేయవలెనా, అను నర్థము దీయరాదు. అధర్మములు చేయుమని శ్రీకృష్ణుడు చెప్ప లేదు. అధర్మాలు చేయుట భగవంతున కిష్టముండునా? అతని కిష్టము లేని అధర్మముల దాసుడు చేయునా? అధర్మములకు మంచి ఫలము గల్గునా? ధర్మ స్వరూపుడగు భగవంతుని మించిన ధర్మాలు లేవు. కావున సర్వధర్మములను విడచి భగవంతుడే ధర్మముగా, మోక్షోపాయముగా నమ్మియుండవలెను.

మాం = నన్ను. అనగా అందరి రక్షించువాడను, నీ చెప్పుచేత లలో రథసారథినై యుండువాడను. ఎప్పుడు రక్షింపుమందువో యని ఎదురుజూచు చున్నవాడను. నీతప్పులు నొప్పులుగా గ్రహించి రక్షింప నెంచువాడను. చెప్పి రక్షింపజేయువారే శిక్షింపుమని చాడీలు చెప్పి. దయగలనాకు కోపము గల్గించి యుడికించినను, దాసుల శిక్షింపక రక్షించు స్వభావముగల నన్ను, ఎక్కడనో పర-వ్యూహములలో గాక, ఏ దేవతల హృదయములలోనో యుండువాడను గాక కృష్ణావతారము దాల్చి సులభముగా నందుబాటులో నున్న నన్ను అని అర్థము.

ధర్మ సంస్థాపనార్థమై అవతరించిన భగవంతుడే "సర్వధర్మాన్ పరిత్యజించి నన్ను శరణుబొందుము!" అనుటచేత ఆ ధర్మము లన్నిటికన్న ధర్మస్వరూపుడగు భగవంతుడే గొప్పధర్మము; మోక్షోపాయము నని తేలుచున్నది. శ్రీకృష్ణుడే సనాతనమగు ధర్మము. "కృష్ణం ధర్మం సనాతన" మందురు గదా! కర్మ-జ్ఞాన-భక్తిసాధనములు భగవత్కరుణ యను ముఖ్యసాధనమును సాధించునవే కావున నితరసాధనములగు ఈ కర్మ జ్ఞానాదులు నూటిగా మోక్ష మీయజాలవు. భగవంతుడే మోక్షమిచ్చు సాధనము.

| భగవంతుడు | ధర్మములు |
| --- | --- |
| భగవంతు డను ధర్మము మోక్షము గల్గించు సిద్ధోపాయము. చైతన్యము గలది. అపాయము లేనిది. అనుకూలమైనది. అన్ని విధములైన శక్తులు కలది. వాత్సల్యము, స్వామిత్వము, సౌలభ్యము అనెడి జీవుల రక్షింపదగిన కల్యాణగుణములు గలది. ఇతర సహాయము నపేక్షింపనిది. | కర్మ-జ్ఞాన-భక్తులనెడి ధర్మములు ప్రాణము లేనివి. కావున, జీవులచే బ్రియత్నించి చేయబడవలసినవి. |
| | జీవుల ప్రయత్నముపై నాధారపడునవి. మోక్షమును నూటిగా నిచ్చుటకు శక్తి చాలనివి. |
| కావున భక్తులకు మోక్షమిచ్చుట కభ్యంతరము లేనిది. | మోక్షము నిచ్చు విషయముతో భగవంతునిపై నాధారపడి యుండునవి. |

ఇందువలన కర్మ జ్ఞానాది ధర్మము లన్నిటికన్న, భగవంతుడను ధర్మమే గొప్పదని తెలియుచున్నది.

అర్జునుడు రథముపై గూర్చుండగా, కృష్ణుడు రథము తోలుచు కాళ్ళు క్రిందికి జారవిడచి తొట్లో కూర్చుండెను. సేనలోని దుబ్బచే తలవెంట్రుకలు మాసియున్నవి. కుడిచేత కొరడా, ఎడమచేత గుర్రపు

కళ్ళెములును బట్టుకొన్నాడు. కృష్ణుడిట్టి తన సారథి వేషమును జూపించుచు నర్జునునితో జెప్పుచున్నాడు. ఈ విధముగా నీ రథ సారథినై నీచెప్పుచేతలలో నున్న నన్ను, భగవంతుడు, కృష్ణావతారుడై అర్జునునకు బండితోలువాడుగా సులభుడై యుండుట అతని సౌలభ్యమనెడి కల్యాణగుణము చేతనే ఇట్లు సులభుడనైన నన్ను,

"ఏకం = ఒక్కనినే, నన్నొక్కనినే సుమా మరెవ్వరినిగాదు. "ఎవరు నన్నే దిక్కని నమ్ముచున్నారో వా రీమాయను దాటగలరు" "మొదటివాడగు వానినే శరణు బొందుము." "నీవే నాకు మోక్షమార్గము జూపుము". "నాకు నీ పాదములే రక్షకములుగా నిచ్చినావు" అను మహాత్ముల సూక్తులవలన, ఒక భగవంతుని మాత్రమే శరణు బొందవలెనని తేలుచున్నది.

ఇట్లు మనము శరణుబొందుటకు గూడ, భగవంతుడే కారణము. మనను బుట్టించినాడు. అవతార రూపముగానో, విగ్రహారూపముగానో, మన కందుబాటులో నున్నాడు. ఇవి మనను తరింపజేయుటకు భగవంతుడు చేసిన సౌకర్యము లేకదా! ఆయన మనకు చేతులు కాళ్ళు మొదలగు నవయవాలు దయచేయుటచేతనే భగవదారాధ నాదికము చేయగలుగుచున్నాము. ఆయన, మనస్సు నీయకపోయినచో దేనితో 'భగవంతుడే నాకు దిక్కని' శరణాగతి చేయగల్గుదుము! కావున శరణాగతికి (ప్రపత్తికి)గూడ భగవంతుడే కారణమని తెలిసికోవలెను. అంతేకాని, తాను శరణాగతి చేయుటయే మోక్షము గల్గుటకు నుపాయ మనికూడ తలంపగూడదు. 'నీవే దిక్కని' నమ్మియుండగలుగుటకూడ భగవంతుని దయవలననే' అని నమ్మాళ్వార్లు సాయించినారు. శరణాగతి చేయకపోయినను భగవంతుడే రక్షింపగలడు. మనము శరణాగతి చేయుటవలననే భగవంతుడు రక్షించుట లేదు జీవులను రక్షించు బాధ్యత భగవంతునిదే. అట్లు మనము చేయు శరణాగతికిగూడ పై విధముగా గారణమై యున్నాడతడు. ఆయన ప్రయత్నము వలననే మనము శరణాగతి చేయగలుగు చున్నాము.

అందుకనే భగవంతుని సిద్ధోపాయమందురు. సిద్ధోపాయము = అన్య సహాయమం దాధారపడక ఎప్పటికప్పుడు ఫలము నిచ్చుటకు సిద్ధముగా నున్న యుపాయము. జీవుని శరణాగతిపై నాధారపడి మోక్ష మిచ్చినచో భగవంతుడు సిద్ధోపాయ మెట్లగును ?

ఐతే, శరణాగతి చేయుటెందుల కనగా, 1. అందరకును ముక్తి నిచ్చు దాతకు, ఏదోవిధముగా నీ జీవుడు తన యోగ్యతను జూపి, ముందునకు వచ్చుటకై, శరణాగతి చేయుచున్నాడు. 2. తప్పక తనను రక్షించునని మనస్సును నిర్మలపరచుకొనుటకు, శర॥. 3. ప్రాణము జ్ఞానము నున్నవాడుగావున ఈ జీవుకు భగవంతుడు రక్షించువాడని తెల్సికొన్నప్పుడు తప్పక రక్షించునని నమ్మకుండ నుండజాలడు గావున, శ॥. 4. ముక్తియందు గల ప్రీతిచేత, శర॥. 5. భగవంతుని దాసుడై యుండుటయే తన పనియని ఈ జీవు డనుకొనుటవల్ల, శర॥. 6. సిద్ధోపాయమగు భగవంతునకు తన ఒప్పుదలను గనబరచుటకై శరణాగతి చేయుచున్నాడు.

భక్తులారా! ఇదివరకు మోక్షమునొందు విషయములో, సిద్ధోపాయము ముందు వైదికకర్మ - జ్ఞానాద్యుపాయములు దిగదుడుపని తెల్సికొన్నాము. ఇప్పుడు మోక్షమొందు విషయములో భగవత్కృప ముందు జీవుని శరణాగతి దిగదుడుపు. భగవత్ప్రయత్నము ముందు జీవుని ప్రయత్నము దిగదుడుపని తెలిసికొన్నాము. భగవంతుడు స్వయముగా జీవుల రక్షించువాడై యుండగా, మోక్షము సంపాదించుటకై నేను శరణాగతి చేయుచున్నా ననుకొనుట అహంకార మగును. కుమారుడు కన్నతండ్రిచేత 'తప్పక పోషింతునని' కాగితము వ్రాయించి పుచ్చుకొనునట్లు నింద్యము నగును. ఆ కర్మ - జ్ఞానాద్యుపాయములు జీవుని ప్రయత్నముపై నాధారపడునవి గావున, ప్రయత్నింపక పోవుటయే యచట దోషము. ఈ సిద్ధోపాయము ఇతర సహాయము నపేక్షింపనిది గావున, నిచట ప్రయత్నించుటయే దోషము. 'శిత్తుం వేండా'

అనుచోట ఈ విషయమే చెప్పబడింది. చరమశ్లోకములో సిద్ధోపాయ మితరసహాయము నపేక్షించనిది గావుననే, సర్వధర్మములను బరిత్యజించుటే ముఖ్యమని, ముందే చెప్పబడినది. జీవుని శరణాగతి సహాయమును మాత్ర మపేక్షించునా ?

ప్రయత్నము కాకపోయిన బోనిమ్ము ఉపకారము చేయువాడు గావున, భగవంతుడే దిక్కని శరణాగతిచే జ్ఞాపకము చేసికొనుచున్నానని యందువా! జ్ఞాపకము చేసికొనుట మనస్సుపని. మనస్సు నిచ్చినదికూడ భగవంతుడే. కావున, నెన్నివిధాల జూచినను అతడే యుపాయముగాని నీ శరణాగతియే యుపాయముగాదు. నీ ప్రయత్నము నీ ఉపకారస్మృతియు గూడ నుపాయములుగావు. తెలిసినదా? ఇట్లు సిద్ధోపాయమైన నన్నొక్కనినే,

"శరణం = ఉపాయమునుగా. శరణమనగా రక్షించువాడు. ఇల్లు అని కూడా అర్థము చెప్పవచ్చును. ఇక్కడ ఉపాయమను అర్థమే తగియున్నది. అట్లు ఉపాయముగా,

"వ్రజ" = నమ్మియుండుము; (పట్టుకొని యుండుము). ఈ యుపాయమును త్రికరణశుద్ధిగా పొందవలెను. జ్ఞానము వలననే మోక్షము కలుగునందురు కావున, మానసికముగా 'భగవంతుడే నాకు మోక్షమిచ్చుట కుపాయమైనవాడని గట్టిగా నమ్మి యుండవలెను.

చరమ శ్లోకములోని రెండవభాగములో భగవంతుడు తాను చేయు పనిని దెల్పుచున్నాడు.

"అహం — నేను. అనగా అన్ని విషయములు తెల్సినవాడను, అన్ని విధముల శక్తికలవాడను, అందరిని రక్షింపవలసిన బాధ్యతగలవాడను అగునేను అన్నమాట. దీనినే వివరముగా దెల్సికొందము. జీవుల కష్టములు పోగొట్టి ఇష్టములు చేకూర్చుటకును, ఇంతకుపూర్వము వీరేస్థితిలో నున్నారో ఇకముం దేస్థితికి బోవలసియున్నదో, తెలిసికొనుటకును సమర్థుడను. వారికి లాభము గల్గించు కల్యాణగుణములు

శక్తియు గలవాడను. ఇట్లు జీవులకు లాభము చేయుట నా సొంతపని కాని జీవునిపనిగాదని తలచి, బాధ్యత వహించువాడను, ఇటువంటి నేను,

భగవంతుడు సర్వ స్వతంత్రుడు. అతని నడ్డుపెట్టువా రెవరు? ఒకరి యాజ్ఞ వలన అర్జునునకు సారధ్యము చేయుచున్నాడా? దాసులకు దాసుడై యుండుటకును అడ్డేమి? ఆ కృష్ణభగవానుని యొక్క కలసిమెలసియుండు సౌశీల్యగుణముచేత, తనకు సారధియై రక్షింపనున్నాడని తలంపక, నాకు నీచముగ రధములోని మనుష్యుడని తలంచి "సర్వధర్మములను విడచి నన్నొక్క నినే ఆశ్రయించు మను చున్నాడు, వీడు నన్నేమి రక్షించునబ్బా" అని అర్జునుడు భయపడు చున్నాడు. అట్లు భయపడకుండ ఆ కృష్ణుడు సర్వలోకములను పాలించు భగవంతుడగు తన యధార్థ స్వరూపమును అహం అనుపదము చేత దెల్పు చున్నాడు.

త్వా - నిన్ను, అజ్ఞానివి శక్తిలేనివాడవు. ఇటువంటి నిన్ను. దీనినే వివరముగా దెలిసికొందము. ఇప్పుడేమి చేయవలెనో తెల్సికొనలేకుండ నున్నావు. తెలిసికొన్నను, ఆ కర్మ జ్ఞాన భక్తులకు గావలసిన శక్తిలేనివాడవై యున్నావు. శక్తియుండి చేసినను, తద్వారా రక్షించువాడను నేనేగదా! ఈ కారణముచేతనే అన్నిధర్మములను విడచి నన్నే యుపాయముగా నమ్మి యున్నావు. అట్టినిన్ను,

"సర్వపాపేభ్యః"-నన్ను బొందుటకు నడ్డముగా నీ యేపాపము లున్నవని నీవు భయపడుచున్నావో అట్టి అన్ని పాపముల నుండి

పాపములనగా :

ఆత్మకాని శరీరమునే ఆత్మయనుకొనుట అట్లనుకొని సంసారములో చెడ్డపనులు చేయుట, అందువల్ల కలుగు కర్మవాసనలు వీని వల్ల అసహ్యాకరమైన శరీరములు కల్గును. ఇట్లజ్ఞానము వలన వచ్చు పాపములు, చేయు కర్మలవలన వచ్చు పాపములును.

పూర్వజన్మలలో సంపాదించుకొన్న పాపములు. కోరి తెచ్చు కొన్న పాపములు, స్థూల సూక్ష్మ శరీరములవల్ల వచ్చుపాపములు, గడ్డి పోచలు గిల్లుట గోకుకొనుట మున్నగు ప్రకృతి వాసనలవల్ల వచ్చు పాపములు. లోకులు నిందింతురను భయముచేత, దయచేత, మనస్సు చలించుటచేత, చేయు పాపములు. పొరపాటున భగవంతుని జేర్చు నుపాయము శరణాగతి యనుకొన్నను పాపమే. అట్టి సర్వపాపముల నుండి,

"మోక్షయిష్యామి = విడిపించగలను. నేను విడిపించ నక్కర లేదు. పాపములు తమంతట తామే విడిపోగలవు, అనగా నా కోపము వలన వచ్చిన పాపములే కావున, నాకు రక్షింతమను బుద్ధి పుట్టుట తోడనే పాపములు తమంతదామే విడపోగల వన్నమాట.

"అర్జునా! నీవు చాలకాలమునుండి పాపములవల్ల పడరాని పాట్లు పడితివి. ఆ కష్టపాటు వదలిపోవునట్లు చేయుదును. ఇంతవరకు నీవు నా పనిని నేనే స్వయముగా చేసికొందునని తలంచినావు సరే, చేసికొమ్మని యూరకున్నాను. కావుననే నీకు కష్టములు కల్గినవి. ఇప్పుడు నీవు 'ఇతర గతి లేదు, నీవే నాకు గతి" యని నన్ను శరణు వేడినావు. కావున, నా శరీరమైన నిన్ను బాగుచేసికొను బాధ్యత నాదిగా నేచూచు కొందును. ఎవరి ఒంటిమురికి వారుపోగొట్టుకొనుటలో కష్టమే మున్నది! పాపముల నుండి విడిపింతును.

"మాశుచః"-దుఃఖింపకుము! నీకు నీ విషయములో నేయాలో చనయు బెట్టుకొనలేదు గదా, నీ రక్షణభారమును నేనే వహింతును. నీ పాపములను సాచివేతగా నోర్చుకొని పుణ్యములుగానే గ్రహింతును. రక్షింతును. ఇక దుఃఖింపకుము" అనుచు శ్రీకృష్ణభగవాను డర్జునుని దుఃఖమును బోగొట్టినాడు.

ఇటువంటి సందర్భములోనే తిరుమడిశయాళ్వార్లు "ఓ మనస్సా! భగవంతుడే లోనప్రవేశించి విరోధులను బోగొట్టి తన కైంకర్యమును

చేయించుకొనుటకై సిద్ధముగ నున్నాడు. ఇక నీ వెందుకు దుఃఖించె దవు?" అన్నారు.

ఈ ప్రపత్తి మార్గమందు నభిరుచి కలుగుట చాల యరుదనుటకు, నొక ముచ్చట కలదు. ఉయ్యక్కొండారు అనువారు భక్తి నిష్టులు. వారిని ప్రపత్తియందు నిష్టగల వారినిగా జేయుటకై, రామానుజుల వారు ఈ చరమ శ్లోకములోని ప్రపత్తిమార్గమును దెల్పిరట.

ఉయ్యక్కొండారులు 'అర్థము మాత్రము బాగుగానే యున్నది గాని, భక్తిని విడచి ఈ ప్రపత్తిని బట్టజాల' ననిరి. అప్పుడు రామానుజులు 'పండితుడవు గావున అర్థము నొప్పుకొన్నావు. కాని భగవంతున కనుగ్రహము రానందున ప్రపత్తియందు నీ కిష్టము లేకపోయిన' దని చెప్పినారట. భగవంతుని దయవలననే ప్రపత్తినిష్టుడు కాగలడు.

ఈ చరమ శ్లోకము వలన ఈశ్వరు డన్నివిధముల స్వాతంత్ర్యము గలవాడని తెలియుచున్నది. సర్వధర్మముల బరిత్యజించి నీవేతప్ప నాకితరమైన దిక్కు లేదని దేవునే నమ్మి యున్నచో, భగవంతుడు సర్వ పాపముల బోగొట్టి మోక్ష మొసంగును. అట్లు మోక్ష మొసంగుట భగవంతుని చేతిలో నున్నది గావుననే, భగవంతు డన్నివిధముల స్వాతంత్ర్యము గలవాడని చెప్పబడినది. ప్రపత్తి కుదురుటకును భగవంతుడే కారణము గావున అతడు సర్వస్వాతంత్ర్యము గల వాడనుటకు సందేహము లేదు.

కృష్ణుడు చిన్నప్పటి నుండియు మనుష్యులకు చేయశక్యముగాని కృత్యములను జేయుచుండుటచేత, ఋషులందరును కృష్ణుడు పరమాత్మయని చెప్పుటచేత, పట్టణమందున్నను అరణ్యము నందున్నను తనను రక్షించు పనియందే యుండుటచేతను, అత డుపదేశించిన యుపాయము లన్నియు దనను రక్షించునవి గావనియు, రక్షకుడు ఆ శ్రీకృష్ణుడే యనియు అర్జునుడు నమ్మినాడు. నమ్మిన తర్వాత ఆ భగవానుడు తననే యాశ్రయింపుమని చెప్పియున్నాడు. కావుననే

'ఈ చరమశ్లోకము అనువాదకోటిలో జేరిన'దని వంగిపురపు నంబె గారు సాయించినారు.

కృష్ణుడు, గీతలో ఈ చరమశ్లోకమునకు బూర్వము కర్మజ్ఞానాదులగు ఇతరోపాయములను అర్జునుని మనస్సును బరీక్షించుటకే చెప్పినాడు. వేదము కర్మ జ్ఞానాదుల నెందు కుపాయముగా జెప్పినదనగా; నేను నాది యని గర్వించి తిరుగు జీవునికి, దొంగపశువునకు గుదిబండ కట్టి వశపరచుకొన్నట్టుగా, కర్మజ్ఞాన భక్తులనెడి యనుష్ఠానముల నంటగట్టి ఆ గర్వము పోగొట్టి వశపరచుకొని, నేను భగవంతునకు దాస్యము చేయవలసిన వాడనే" అను ఆత్మస్వరూప జ్ఞానము గలుగజేయుటకే. సన్యాసి బ్రహ్మచారి కర్మలను, గృహస్థు జేయు కర్మలను, వానప్రస్థుడు చేయు కర్మలను విడిచిపెట్టునట్లు, ఈ మాత్రపు స్వరూపజ్ఞానము కలిగిన తరువాత, ఈ కర్మ జ్ఞానాద్యుపాయములను విడిచిపెట్టుట దోషము కాదు.

ఇట్టి ప్రపత్తి నిష్ఠుడు మాత్రము కర్మజ్ఞాన భక్తులను పూర్తిగా విడిచియున్నాడా? లేదు. తన కులమునకు ఆశ్రమమునకు దగిన వృత్తులు మొదలైనవి మోక్షోపాయములని తలంపక, లోకులకు మేలుచేయు నుద్దేశముతో, ఇతరులుగూడ చేయుచుండుటకును (లోక సంగ్రహార్థము) భగవంతునకు బ్రియమైన వగుటచేతను, పరమేశ్వర ప్రీత్యర్థముగా మాత్రమే చేయుచున్నాడు. అనగా, కర్మానుష్ఠానమును భగవత్కైంకర్యములోనికి జేర్చుకొనును. జ్ఞానమును, భగవత్సేవత్వమే తన స్వరూపమని, సర్వవిధాల జీవుల రక్షించువాడై యుండుటే పరమాత్మ స్వరూపమని తెలిసికొనుట లోనికి జేర్చుకొనును. మోక్ష సాధనము భగవంతుడని తెల్సికొని భక్తిని భగవత్సేవాభిరుచి లోనికి జేర్చుకొనును. ప్రపత్తిని భగవచ్ఛరణాగతి చేయవలసిన నాకు నతడే దిక్కనెడి స్వరూప యథార్థ్య జ్ఞానములోనికి జేర్చుకొనును.

అనేక జన్మలెత్తి, కర్మ-జ్ఞానాదులచే సాధింపదగిన భక్తి మార్గము కష్టమనియు, అన్ని ప్రయత్నములను విడిచిపెట్టి తద్ద్వారా

పట్టదగిన ప్రపత్తిమార్గము సులభమనియు, శాస్త్రములందు జెప్పబడినది. మార్గమునందున్న వారికి తను రక్షకుడు భగవంతుడే కావున, అతని దయయే నిజమైన మోక్షోపాయమని తెలుచున్నది. కాన, భగవంతుని రక్షణ వద్దనక ప్రార్థించువాడుగా నున్న చాలును. తప్పక రక్షించును.

శ్రీరాముడు 'పాపముతో వచ్చి శరణుబొందినను రక్షింతు' నన్నాడు. శ్రీకృష్ణుడు పుణ్యమును విడిచిపెట్టి వచ్చి శరణుబొందిన రక్షింతు'నన్నాడు. ఈ ప్రపత్తి విషయములో ఎంబెరుమానారులు భట్టరు వారితో "ప్రపత్తినిష్ఠుడై భగవంతుని గొప్పతనమునుబట్టి, నిజమని నమ్మి, ఆస్తికుడై శరణాగతి విషయములో నభిరుచిగల్గి మోక్షము పొందిన పొందవలెను. లేకున్న నాస్తికుడై చెడిపోయిన జెడిపోవలెను అంతే. మూడవ పద్ధతి లేదు" అని చెప్పినారు. నమ్మకము లేనివానికి ప్రపత్తిమార్గము అజీర్ణరోగికి అన్నమువలెనే వికటించును. పెరియాళ్వార్లు త్రికరణశుద్ధిగా "మామేకం శరణం వ్రజ" (-నన్నొక్కనినే శరణుబొందుము) అను వార్తను నమ్మి శ్రీరంగనాయకులకు శరణాగతి చేసినారు. అట్లు త్రికరణశుద్ధిగా ప్రపత్తి నిష్ఠులైననే మోక్షాధికారు లగుదురు.

ఈ చరమశ్లోకార్థము యొక్క ఈ యర్థమునే ప్రపత్తినిష్ఠులగు నమ్మాళ్వార్లు, తిరుముడిశై యాళ్వారును తమ గ్రంథములందు వ్రాసి యున్నారు.

ఈ చరమశ్లోకోపన్యాసమందు క్రమముగ ఈ క్రింది విషయములు చర్చింపబడినవి :

ప్రపత్తిమార్గ మవలంబింప దగిన అధికారి విడువవలసిన ధర్మములు, విడువవలసిన విధము, పట్టుకోవలసిన సిద్ధోపాయము, అట్లు పట్టుకొనుటలో గూడ భగవంతుని ఉపకారము, భగవంతు డెట్లు

ఉపాయమైనదియు, అతనిని సిద్ధోపాయముగ నమ్ముట, భగవంతుని జ్ఞానశక్త్యాది గుణములు, అతనియందు భారముంచునట్టి అధికారి, అధికారికి విరోధములగు పాపములు, వాని బోగొట్టుకొను విధము, పాపముల బోగొట్టు భగవంతుని ఆశ్రయించుటవల్ల అధికారము తీరుట. ఇవి క్రమముగా చెప్పబడినవి.

లోకా స్సమస్తా సుఖినో భవంతు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః








శ్లో॥ త్రాహీతి వ్యాహరంతం త్రిదశరిపుసుతం త్రాతుకామోరహాస్యే
విస్రస్తం పీతవస్త్రం నిజకటియుగళే సవ్యహస్తేన గృహ్ణన్ ।
వేగత్రాస్తం నితాంతం ఖగపతి మమృతం పాయయన్నన్యపాణౌ
సింహద్రా శీఘ్రపాతః క్షితి పిహిత పదః పాతుమాం నారసింహః ॥